# బసవ వచనామృతము

(వ్యాఖ్యాన సహితము)


అనువాదకులు - సంపాదకులు



ప్రచురణ :

పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం,

హైదరాబాదు, ఆంధ్రప్రదేశ్. 2001




5 సెప్టెంబర్ -2000న విజ్ఞాన్ భవన్ న్యూఢిల్లీలో శ్రీ
జాతీయ ఉత్తమ ఉపాధ్యాయ అవార్డును అందు

యథాతథము

# బసవ వచనామృతము

(వ్యాఖ్యాన సహితము)

మూలం : 12వ శతాబ్దికి చెందిన అవతార పురుషుడు బసవేశ్వరుడు ముఖతః పలికిన కన్నడ వచనములు


అనువాదకులు-సంపాదకులు : **కొండా బసవరాజు** కొల్లంపల్లి

గజిటెడ్ ప్రధానోపాధ్యాయులు,

రాష్ట్రపతి అవార్డు గ్రహీత,

జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, కన్మనూర్

జిల్లా : మహబూబ్‌నగర్. - 509 351.

ఫోన్ :- 08542-50445



**పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం,**

హైదరాబాదు వారి ఆర్థిక సహాయముతో ముద్రితము.

డిసెంబరు, 2001

యథాతథము

# బసవ వచనామృతము

(వ్యాఖ్యాన సహితము)

మూలం : 12వ శతాబ్దిలో చిదాత్మ ఆదేశముతో అవతారపురుషుడై వెలిసిన బసవేశ్వరుడు ముఖతః పలికిన కన్నడ వచనములు


అనువాదకులు - సంపాదకులు : **కొండా బసవరాజు** బి.యస్.సి; బి.ఇడి.

ప్రథమ ముద్రణ : డిసెంబరు 2001

ప్రతులు : 2000

వెల : 25/-రూ॥లు





**పుస్తకములు లభించు స్థలములు :**

1. **నవయుగ బుక్ హౌస్,** 4-5-317, క్లాక్ టవర్ ఎదురుగా, సుల్తాన్ బజార్, హైదరాబాద్ - 500 004. ఫోన్ నెం. 040 - 475 4688.
2. **కె. బాలస్వామి** యం.ఎ. యం.ఇడి. (పిహెచ్‌డి)
   కార్యదర్శి,"నందీశ్వర సాహితీ సంస్థ",
   పోస్టు : మరికల్ - 509 351.
   జిల్లా : మహబూబ్‌నగర్. (ఆం.ప్ర.)

ముద్రణ : **సాయిరాం ప్రోసెస్, శ్రీ బి. సత్యనారాయణ**
ఆఫ్‌సెట్ ప్రోసెసింగ్ & ప్రింటింగ్, ఫ్లాట్ - 114; సావరిన్ షెల్టర్స్, లకిడికాపూల్,
హైద్రాబాద్ - 500 001 ఫోన్ : 040 3307622, 3398809.

డెస్క్ టాప్ పబ్లిషింగ్ : **ఐసోలారీస్ డిజి క్రియేటి శ్రీ బి. గణపతి.**

# మున్నుడి

భువియందు మానవాళికి జాతివర్ణవర్గ రహితముగా మార్గదర్శనము గావించి వారి ఉద్ధారమునకై భగవంతుని (Supreme God - పరశివుని - పరమాత్ముని) దూతలు (ప్రేషిత)గా అవతారపురుషులై జన్మించిన వారలలో బసవేశ్వరుడు యొకరు. 12వ శతాబ్దమందు చారిత్రిక ఆధారముల ప్రకారముగా "బాగెవాడి" (కర్నాటక రాష్ట్రపు బాగల్ కోట జిల్లా) యందలి కమ్మెకులపు శైవబ్రాహ్మణ దంపతులు మాదలాంబిక, మండగి మాదిరాజ అనుదంపతులకు ఆనందనామ సంవత్సర వైశాఖ శుద్ధ అక్షయతృతీయ రోహిణీ నక్షత్రము నందు బసవేశ్వరుడు జన్మించెను. పూర్ణపురుషుడుగా వెలుగొంది సుమారు అరువది రెండు సంవత్సరములు జీవించి పరమాత్ముని సన్నిధానమును చేరుకొనిరి.

తెలుగు భాషలో బసవేశ్వరునిపై, మొట్టమొదట "బసవపురాణము" వ్రాసినది పాల్కురికి సోమనాథుడు. దీని ఆధారముతోనే అతడు జన్మనొందిన కన్నడ నాడులో భీమకవి కన్నడ భాషలో "బసవపురాణము" రచించిరి. బసవనకు పూర్వము శైవము శాఖలై లకులీశ, కాలాముఖ, పాశుపత, కాపాలిక వీరశైవములుగా వ్యాప్తిలోయుండినవి. కులములు, తెగలు, జాతులుగా విభజింపబడిన జనావళి మూఢాచారములను పాటిస్తూ తగు మార్గదర్శనములేక అలమటిస్తూ యుండిన తరుణమున సృష్టికర్త పరమాత్ముని పనుపున. కలియుగ మానవులనుద్ధరించుటకై బసవేశ్వరుడు జన్మించి తన జన్మకారణమగు కుల, మత, వర్ణ, వర్గ రహిత సమాజమును ఏర్పరచి వారి ఉద్ధారమునకుగాను వీరశైవమును సంస్కరించి నూతన "లింగవంత" ధర్మమును స్థాపించిరి. అదియే అతడి తదుపరి బసవధర్మమని పిలువ బడుచున్నది.

15వ శతాబ్దము వరకు బసవపురాణము తప్ప, వచనములు లభ్యము కాని కారణముగా లింగవంత ధర్మము గూర్చి సరియగు మార్గదర్శనము లభించలేదు. ఇటీవలే సుమారు 50 సం॥ల ముందుగా డాక్టర్ ఫ.గు. హళకట్టి వారికి అద్భుత రీతిన వచన సాహిత్యము లభించి వారు దానిని ప్రకటన గావించన పిదపనే నేడది తెలుగు, కన్నడ, మరాఠి, తమిళు, హిందీ, ఆంగ్లము, జర్మన్, ఫ్రెంచి, రష్యన్ మున్నగు భాషలలో ప్రచురణలు గాంచుట జరిగినది.

బసవేశ్వరుడు "కూడల సంగమదేవా" అను మకుటముతో నాల్గులక్షల అరువైనాల్గు వేల వచనములు వ్రాసినటుల తెలియవచ్చిననూ అన్నియూ కాలగర్భమున గలవు. కర్ణాటక విశ్వవిద్యాలయము వారు "షటస్థల వచనములు" అని ప్రచురించిన గ్రంథములో 1393

వచనములు మాత్రము గలవు. ఈ వచనముల నుండి మహత్వపు 108 వచనములు సంపాదించి యథాతథాముగా తెలుగు అనువాదము వ్యాఖ్యానము సహితముగా వ్రాయనైనది. సవరణలు ఏవేని విజ్ఞులు సూచించెడిచో మున్ముందు సవరించి వెలువరించు ప్రయత్నము చేయనగును. బసవేశ్వరుల వారి వచనములందు సమస్త మతములలోని ప్రధాన సూత్రము లన్నియూ, సామాన్యమానవులకున్నూ తెలియు లాగున కలవు. సర్వధర్మముల సారమీ వచనములందు గలదు. అమృతము వంటి వచనములను నిత్యమూ పఠిస్తూ అనుష్టించిన జనన మరణ బంధ విముక్తులగుదరు. వేదాగమములందలి ఉత్తమమును మాత్రము గ్రహించి వచనాగమము సిద్ధపరచడమైనది. బసవాది శివశరణుల వచనములన్నియు అనుభవసిద్ధమైనవి. ఆధార గ్రంధములుగా, బాడల రామయ్య బసవేశ్వర వచనములు, కన్నడ వచనసంగమము మరియు బసవణ్ణనవర వచనగళు ఈ ప్రకటనమునకు ఉపయోగపడినవి.

బసవేశ్వరుడు ఆది ప్రమథుడుగా అతడి సమకాలీన శివశరణులు పలికిన మాటలు వచనములుగా, వీరెల్లరి వచనములు ధర్మ సంహితగా ఎంచబడుచున్నవి. బసవేశ్వరుల వారి వచనముల వలె శివశరణుల వచనములన్నియూ క్రమేణ తెలుగు నందు తేవలసియున్నది. ప్రప్రథమముగా "బసవవచనామృతము" తెలుగు వచనములు సమూల వ్యాఖ్యానముతో గల దానిని పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయము హైదరాబాద్ వారి ఆర్థిక సహాయము ద్వారా ప్రచురించుట జరిగినది. ఆచార్య యన్. గోపి తెలుగు యూనివర్సిటి వారికి, సంబంధిత విశ్వవిద్యాలయ అధికారులకు హృదయ పూర్వక కృతజ్ఞతలు. ప్రోత్సహించి సలహానిచ్చి ప్రూఫ్‌రీడింగ్ చూచిన శ్రీ కె. బాలస్వామి పండితుల ...రికి, శ్రీ రాజేంద్ర జిరోబె ఉద్గీర్ (మహారాష్ట్ర) వారికి, స్వల్ప సమయ మందు అందముగా ...ద్రించి ఇచ్చిన సాయిరాం ప్రోసెస్ ముద్రాపకులకు మరియు డెస్క్ టాప్ పబ్లిషింగ్ ...న శ్రీ బి. గణపతి గారికి మనఃపూర్వకముగా కృతజ్ఞతలు తెలుపుకొనుచున్నాను.

శివయోగము నందు లింగాంగ సామరస్యము సాధించి జీవిత చరమాంకమున ...రమాత్ముని (Supreme God) సన్నిధానమును చేరుకొనుటకు "షట్ స్థలము"లను ఆరు ...ధ్యాత్మిక సోపానములు గలవు. అవియే 1. భక్త స్థలము, 2. మహేశ్వర స్థలము 3.ప్రసాదిస్థలము 4. ప్రాణలింగిస్థలము 5. శరణ స్థలము 6 ఐక్య స్థలములు. ఎవరేని ఈ సోపానము లందలి ఒక్కొక్క మెట్టునధిరోహించి దివ్యమానవుడిగా ఎదిగి పరమాత్ముని సన్నిధానమును చేరుకొనవచ్చును. వచనములను ఈ షటస్థల పద్ధతిన విభజించుటచే "షట్ స్థలవచనములను" పేరిడిరి. అట్టి విధానముననే "బసవ వచనామృతము" వ్రాయబడినది పాఠకులెల్లరు ఈ వచనామృతమును గ్రోలి తరింతురు గాక.

– కొండా బసవరాజు

# అభిప్రాయము

మానవుడు సందిగ్ధావస్థలో కొట్టు మిట్లడుతూ క్రియా శూన్య స్థితిలో ఉన్న తరుణములో అతనికి జ్ఞానోదయము కలిగించి విశ్వమానవ కళ్యాణ కారకుడిగా అతడిని తీర్చిదిద్దడానికి భగవంతుడు ప్రత్యక్షంగా కాని, పరోక్షంగాకాని తన దివ్యవాక్కులను కటాక్షిస్తాడు. వేద వాఙ్మయము, ఉపనిషత్తులు, భగవద్గీత ఈ కోవకుచెందిన వాటిగా గ్రహించిన యెడల, బసవేశ్వరుని వచనములు అట్టి ఆధ్యాత్మిక ప్రయోజనమును నెరవేర్చే మహోత్కృష్ట పరమప్రమాణ భగవద్వాక్యములుగా స్వీకరింప వలసి ఉంటుంది.

12వ శతాబ్దిలో ఆధ్యాత్మిక ప్రపంచమందు అంధకారము నెలకొని యుండెను. బ్రహ్మావాదుల యొక్క తార్కిక దృష్టి, శంకరాదులు మిథ్యావాద వాదన, భగవంతుని యొక్క అస్థిత్వాన్ని శంకించే నాస్తిక సిద్ధాంతములు సామాన్య మానవుడిని అంతగాప్రభావ పరచలేకపోయాయి, మానవ కళ్యాణాన్ని చేకూర్చే సాధనము మృగ్యమైన దశలో బసవేశ్వరుని యొక్క వచనములు అనిర్వచనీయమైన ఆధ్యాత్మిక ప్రకాశమును ప్రసరింప జేసి సామాన్య మానవుడిని అసామాన్య దైవత్వం వైపు పయనింప జేసే ఘనతను సంతరించుకొనినవి.

ఈ వచనములు వేదాలకు గాని, ఉపనిషత్తులకు గాని మరే యితర సాహిత్యమునకు గాని వ్యాఖ్యానములు గావు అవతార పురుషుడైన బసవేశ్వరుని యొక్క ఆధ్యాత్మిక అనుభవము నుండి ఉద్భవించిన ఉజ్వల మణిదీపికలు. సర్వతంత్ర స్వతంత్ర భావాలకు ప్రతిబింబాలు. అనుభవ మంటపములోని అగ్రశ్రేణి శివశరణుల నిశిత పరిశీలనకు గురియై నిలచి సువర్ణ కాంతులను వెదజల్లే అమూల్య ఆభరణములు.

విశ్వకళ్యాణ కారకుడైన పరశివుని పరమార్థతత్వమును, దాని స్వభావాన్ని, దాని విశిష్టలక్షణములను, ఆతత్వాన్ని అవగాహన చేసుకోవడానికి వలయు మార్గమును, శివానుభవ సంపాదనకు పొందవలసిన జ్ఞానమును, ఆ జ్ఞానము ద్వారా శివానంద మును తద్వార శివైక్యతాసిద్ధిని పొందే పద్ధతులను బసవేశ్వర వచనములు అతిసామాన్య లకు ఎంతో సులువుగా అవగతమయ్యే విధంగా వివరించడం జరిగినది.

కన్నడ వాఙ్మయములో బసవేశ్వర వచనములకు ఉపనిషత్ ప్రమాణము వంటి గౌరవము లభించినది. ఈ వచనముల ఆధారముగా గొని సాహిత్య కృషిని సల్పిన పాలకురికి సోమనాథుడు ఆంధ్ర వాఙ్మయములోఅగ్రశ్రేణి ధృవతారగా నిలిచినాడు. ద్రవిడ, మహారాష్ట్ర

కవిపండితులు బసవ వచనములచే ప్రభావితులై అమ్యూలమైన సాహిత్యసేవలను చేసినారు. యిట్టి మహా మహిమాన్వితుడైన బసవేశ్వరుని యొక్క తత్వమును తెలిసి కోవడము అంత సులభసాధ్యమైన విషయముకాదు. దీనికి గల కారణము ఏమనగా అతని తత్వము కేవలము ఒక ప్రత్యేక మతమునకు కట్టుబడినది కాదు. అందులో వేదాంత సారము, ఆధ్యాత్మిక విజ్ఞానము, సాంఘిక సిద్ధాంతము, ఆర్థిక సిద్ధాంతము, నైతిక సూత్రములు మొదలగు వైవిధ్య పరమైన అంశములు యిమిడి యున్నవి. బసవేశ్వరుని వచనములు ఆ తత్వమును తెలియబరచుటకు కొంత వరకు ఉపయోగ పడగలవు.

నేటి వరకు బసవచనములు తెలుగులో లభ్యమైనంత మేరకు పరిశీలిస్తే ఆయా రచయితలు వారి వారి పరిజ్ఞానమునకు లోబడి బసవేశ్వరుని యొక్క వచనములు వ్యాఖ్యానించడము జరిగినది. కాని అవి తెలుగు పాఠకులకు బసవ వాక్కుల ప్రత్యక్ష ధర్శనము కల్పించ లేక పోయాయి.

శరణశ్రీ కొండా బసవరాజు గారు ఈ దిశగా చేసిన ఈ ద్వితీయ ప్రయత్నము అత్యంత శ్లాఘనీయమైనది. పాఠకుడు బసవ వాక్కులను పఠించి తదను వాదమును పరిశీలించిడము ద్వార తన అవగాహనము గణనీయంగా పెంపొదించుకోగలడు. వీరు చేసిస ఈ ప్రయోగము సమకాలీన ప్రపంచములో భగవద్గీతకు వెలువడిన వ్యాఖ్యానములతో పోల్చదగినది. బసవేశ్వరుని కన్నడ వచనములకు ప్రతిపదార్థ తాత్పర్యమును పొందుపరచిన యెడల యిట్టి సాహిత్య కృషికి సముజ్వలమైన ప్రాముఖ్యాత, సామాజిక ప్రయోజనము చేకూరేది. అట్టి ప్రయత్నాన్ని శ్రీ కొండా బసవరాజు గారు సమీప భవిష్యత్తులో చేయగలరని ఆశిస్తున్నాను.

రాష్ట్రపతి సాధికార సన్మానమును పొందిన కొండా బసవరాజు గారి యొక్క సాహిత్య కృషి యెంతో ప్రశంసనీయమైనది. యింత వరకు మరెవ్వరు చేపట్టని విధంగా ఈ కార్యాన్ని సాధించి తెలుగు సాహిత్య ప్రియులకు, ప్రత్యేకముగా బసవ సాహిత్య అభిమానులకు ఎంతో సంతోషాన్ని కలిగించినాడు. వారి ఈ కృషి వలన పాఠకులు బహుముఖమైన ప్రయోజనములు పొందగలరని నా ప్రగాఢ విశ్వాసము, శ్రీ కొండా బసవరాజుగారికి గురులింగ శివలింగ, జంగమలింగ, కరుణాకటాక్షములు లభించి తద్వారా ఆయురారోగ్య ఐశ్వర్య సిద్ధి సంపూర్ణ స్థాయిలో పొందాలని నేను మనసారా వాంఛించుచున్నాను.

తేది :- 10-11-2001

హైద్రాబాద్

ఇట్లు

**శివశ్రీ మఠం లింగయ్య స్వామి,** అసిస్టెంటు ప్రొఫెసర్

ఉస్మానియా విశ్వవిద్యాలయము హైద్రాబాదు.

# అభిప్రాయము

మానవ జన్మము అదృష్టవంతము. ఈ జన్మ సార్థకతకై అనునిత్యము సృష్టికర్త పరమాత్మని స్మరించుటను అభ్యాసము చేసికొనిననే అంత్యకాలమున ఆ దేవ దేవుని స్మరించుట సాధ్యమగును. భగవన్నామమునకు భగవానునకు భేదములేదు. నిరాకార పరమాత్మని పూజించి, ప్రార్థించి, ధ్యానించుటను అలవరచుకొనవలెను. జీవిత సమస్యలకు శాశ్వత పరిష్కారములభించుటకు గాను 12వ శతాబ్దమున బసవాది శివశరణులు వచన సాహిత్య సృష్టిగావించిరి. అట్టి సాహిత్య పరంపరకు చెందిన "బసవవచనాల నుండి" 108 వచనములు "భగవద్గీత" వలె వ్రాయబడిన ఈ "బస్వవచనామృతము". ప్రతి యొక్కరూ భక్తితో పారాయణము చేయవలసిన మౌలిక గ్రంథము. ఇందలి వచనములు నిత్యమూ పఠిస్తూ అనుష్టించిన జీవితపు సర్వ దు:ఖములనుండి మరియు క్లేశముల నుండి ముక్తుడు అగుట జరుగును.

బసవచనామృతము సృష్టికర్త పరమాత్మని దూత (Prophet) అగు 12వ శతాబ్దికి చెందిన బసవణ్ణ వారు స్వయముగా పలికిన వాక్కులు. అవి భాగవద్వాక్యములు. కావున వాటిని యథాతథముగా కన్నడమున గల వాటిని తెలుగులిపిలో తెచ్చుటే కాక మూల వచనములు తెలుగులో వ్రాయుబడుచూ వ్యాఖ్యానమున్నూ వ్రాయుట వలన ఇది ప్రామాణిక గ్రంథముగా ఒప్పుచున్నది. భావము స్వీయ గ్రాహ్యామై యున్నది. 21వ శతాబ్దపు మనుజులు తెలుసుకోవలసినది "వచన సంహిత"యూ యొక ధర్మగ్రంథమని, సృష్టికర్త పరమాత్మడొక్కడే దేవదేవుడని అతడే సర్వానంద నిధియని, పరబ్రహ్మమని, పరశివుడని, దివ్యుడని పుట్టుకలేని వాడని, పరంధాముడని తెలియవలసియున్నది.

నిస్వార్థ చేవచేసిన వారే ఆత్మసాక్షాత్కారము బడయుదురు. పుట్టిన జనులెల్లరుకూ భగవద్ధామమునకు చేరవలెనను ఆకాంక్ష యుండును. అట్లు చేరగోరువారు దేహభావననుండి ముక్తులగుటకు ప్రయత్నించవలెను. భగవత్స్వరూపులగు నిజగురువు కటాక్షము కలిగిన వారు శుద్ధచైతన్య స్థితి పొందుదురు. ఇట్టి దాని సాధనకు బసవాది శివశరణుల "వచనములు" పఠించుట అత్యావశ్యకము. ఈ కారణముగా గ్రంథమును ప్రకటించిన కొండా బసవరాజుగార్కి మున్ముందు ఇతర వచన సాహిత్యమును జనావళికి అందించు శక్తిని పరమాత్ముడు ప్రసాదించుగాక.

**ఋష్యశ్రీ శివయోగి నిజయోగాలయము**

జడ్చర్ల "X" రోడ్డు,

జిల్లా॥ మహబూబ్‌నగర్.

తేది : 14-11-2001

దీపావళి.

# వినుడి బసవేశ్వరుని మాట వీనులార

కం॥ బసవా నీవచ నామృత
మసమానత బాపి విశ్వ మానవ ముక్తిన్
దెసలం జాటిన గురువర
బసవేశ్వర నిన్ను గొల్తు భావము నందున్.

కం॥ ఒక్కడు పరమాత్ముండని
నిక్కముగా మనసు నిల్పి నిశ్చల భక్తిన్
చక్కగ మదిగొల్చు మనెను
మక్కువ పరమాత్మ నిన్ను మరువక బ్రోచున్

తే.గీ.॥ బసవ వచనామృతము గ్రోలి భక్తిమీర
జన్మ ధన్యత గాంచుడీ జన్మ మందె
గనుడి పరమాత్మ జీవిత గమ్యమతడె
వినుడి బసవేశ్వరుని మాట వీను లార.

కం॥ బసవా బసవా బసవా
వసుధను వెలిగింప నీదు వచనము లెల్లన్
బసవ జ్యోతులు గాగను
వెసగంగా మనుషులందు విశ్వము నిండన్

కం॥ బసవా నీ వచనంబులు
దెసలెల్లను వెలిగె నేడు తేజము తోడన్
బసవా యని దలచిన చో
వసుధలో వొనగూడు భక్తి వాంఛిత ముక్తిన్.

తే.గీ.॥ మనుజు లందరి లోపల మహిని జూడ
కులము మతములనన్నియు కూల దోసి
లింగ ధారణ గావించి లింగ మతము
మిన్న యని చాటె బసవడు చెన్నుమీర

కం॥ అంతా పరమాత్ముండని
సంతతమున భక్తి గొల్వ సాధ్యంబనుచున్
చింతలు ఏలా? విను మరి
శాంతముగా "బసవ వాక్కు" సద్గతి జూపున్.

**కె.బాలస్వామి,**
సీనియర్ తెలుగు పండిట్
యం.ఎ.యం.ఇడి. (పిహెచ్‌డి)
**కార్యదర్శి నందీశ్వర సాహితీ సంస్థ**
పోస్టు : మరికల్, మం॥ ధన్వాడ - 509 351. జిల్లా : మహబూబనగర్.

Prof. **E.SIVA REDDY,**
M.A., Ph,D (Telugu)
M.A. (Sanskrit)
Head of the Department of Telugu,
University College of Arts & Social Sciences,
Osmania University, Hyderabad - 500 007.

# అభినందన

కన్నడ భాషలోని బసవేశ్వరుని వచనాలను తెలుగులోకి తీసుకుని వచ్చి శ్రీ కొండా బసవరాజు గారు శైవం పట్లవారికి గల భక్తి ప్రపత్తులను అనితరంగా చాటుకున్నారు. ఈ వచనానువాద శీర్షికకు వారు జోడించిన పదం అమృతం. నిజంగా ఇది వాక్సుధ. వీరశైవ మతాభిప్రాయాలను కాని బసవేశ్వరుని భావాలను గాని సంపూర్ణంగా ఆధునికులు అంగీకరింపక పోవచ్చు. అది వేరు మాట. స్తబ్ధమైన నాటి సమాజంలో వీర శైవం కాని బసవేశ్వరుడు కాని ఒక విధమైన కుదుపును. ఊపును తీసుకవచ్చారు. వెన్నుముకలో వేడి పుట్టించారు. సాహిత్య చరిత్రాభిమానులందరికి ఈ విషయం అవగాహనలో ఉన్నదే. అయితే చరిత్రకూ సాహిత్యానికి ముడిపెట్టి చూసినప్పుడుగాని దీని విలువ మనకు తెలియదు.

శ్రీ బసవరాజుగారి ఈ అనువాదం ఆర్జవమైన హృదయంతో చేసింది. కన్నడ మూలంలో ఇచ్చి, దానికి వచనానువాదం జోడించి, వివరణ కూడ సమకూర్చారు. వచన విభాగం చేశారు. బసవరాజుగారి వచనాలు. వాక్యాలు కొన్నిచోట్ల సూక్తులై ప్రసరించాయి. మరి కొన్ని సందర్భాల్లో గతిని సంతరించుకొని గంభీరంగా నడిచాయి. ఇంతకు ముందు ఎందరో అనువాదం చేసి ఉండవచ్చు. కాని స్వచ్ఛమైన హృదయంతో, అభినివేశంతో చేసిన రచనలో నెరసులు, సరసులు వెదకరాదని ఆశిద్దాం.

ఈ ప్రయత్నంలో వారి దీక్షను అభినందిస్తున్నాను.

**రసభారతి,** హైదరాబాద్
తేది :- 16-11-2001

ఇట్లు
ప్రొఫెసర్ : **ఎల్లూరి శివారెడ్డి**
**అధ్యక్షులు తెలుగుశాఖ ఉస్మానియా విశ్వవిద్యాలయము, హైద్రాబాదు.**

Dr. M. CHANNAPPA
M.A., M.Phil, Ph.D (Telugu)
Associate Professior of Telugu
University College of Arts & Social Sciences,
Osmania University, Hyderabad - 500 007.

# యథార్థజ్ఞానం

బసవేశ్వరుడు వీరశైవలకు గురువుగా ఆరాధింపబడతాడు. కాని అతడు వీరశైవలు కాని వారికి కూడ గురువని నా తలంపు. అతని వచనాలు కేవలం వచనాలు కావు. జ్ఞాన ప్రవచనాలు. మూల తత్త్వాన్ని స్పృశించిన అమృత వచనాలు గురువైన బసవడు గురుముఖంగానే పరమాత్మ ఉనికి బోధపడుతుందన్న విషయం సత్య సమ్మతమైంది.

"శివ పథ మరయుటకు గురు పథమువలయు" కుమ్మరి కుండకు మట్టి అవసరమైనట్లే పరమాత్మ ఉనికికి గురువవసరమని ఉపమానం ద్వారా బసవేశ్వరుడు తెలియజేశాడు.

బసవేశ్వరుని అనుభవంలోంచి పుట్టుకొచ్చిన ఈ వచనాలు విశ్వజనులు గ్రహింపదగ్గవి. ఉత్తములు సాధారణంగా ఉండవలసిన విధానాన్ని ఆయన చక్కగా (15.2) వచనంలో తెలియజేశాడు. సుఖాన్ని పూర్వజన్మ పుణ్యఫలమనీ, దుఃఖాన్ని పూర్వజన్మ పాపఫలమనీ, తమ కర్మలకు తామే కర్తలమనీ, పాపపుణ్యాలు తమ చేతులందే గలవని బసవని ఉద్భోధ.

బసవేశ్వరుని అనుభవసారమే వచనరూపంలో అవతరించింది. అయితే ఆలోన వెలిబుచ్చిన భావాలు అనేకం. వేద సమ్మతమైనవని నా అభిప్రాయం.

వేదం ఏకేశ్వరోపాసనను ఉద్భోధిస్తున్నది. బసవడు కూడ ఇదే విషయాన్ని చెప్పాడు.

"ఇద్దరు ముగ్గురు దేవుళ్ళని ఉబ్బిమాట్లాడకు. ఒక్కడేచూడుడో ఇద్దరనునది అబద్ధము" (పుట - 39). వేదం "మాగృధః కస్యస్విద్ధనమ్" ఇతరుల ధనాన్ని అపహరించవద్దని చెబుతున్నది. బసవడు కూడ ఒక వచనంలో "కళబేడ" అని ప్రబోధిస్తాడు.

బసవడు మహా పురుషుడు సంస్కర్త. లోకంలో వ్యాపించిన మూఢాచారాలను ప్రతిఘటించాడు. నాగులచవితి రోజు నాగులకు పాలుపోస్తారు. కాని ఆ నాగులే కనిపించినప్పుడు ఎందుకు వాటిని చంపుతారని సూటిగా ప్రశ్నిస్తాడు.

అద్వైతాది విభిన్న వాదాలతో విసగి వేసారే జనానికి శివతత్త్వాన్ని ప్రబోధించి జ్ఞాన బిక్షనొసంగిన బసవేశ్వరుని వచనాలను నూటి ఎనిమిదింటిని గ్రహించి గేయ, వ్యాఖ్యాన రూపంలో తేట తెనుగున సరళీకృతం చేసిన మిత్రులు శ్రీ కొండా బసవరాజుగారి కృషి ఎంతైనా అభినందనీయం.

మనం కొత్తగా చెప్పేదానికంటే మనకంటె పూర్వులు అందించిన యథార్థజ్ఞానాన్ని మనం అనువదించి లోకానికి అందించడం వల్ల ఎంతో మేలుకలుగుతుంది. శ్రీ బసవరాజుగారి అనువాదం లోకోపకారకమైంది. వారిని ఈ సందర్భంగా అభినందిస్తున్నాను.

తేది :- 16-11-2001

హైద్రాబాద్

ఇట్లు

డా॥ మసనచెన్నప్ప

[redacted] తెలుగుశాఖ, ఉస్మానియా విశ్వవిద్యాలయము, హైద్రాబాదు.

# యథాతథము

# బసవ వచనామృతము

## (వ్యాఖ్యాన సహితము)

## ౧ భక్త స్థలము

## ౧ పిండ స్థలము

ఉదకదొళగె బయ్చిట్ట బయ్కెయ కిచ్చినంతిద్దిత్తు;
ససియొళగణ రసద రుచియంతిద్దిత్తు;
ననె యొళగణ పరిమళ దంతిద్దిత్తు;
కూడల సంగమ దేవర నిలవు
కన్నెయ స్నేహదం తిద్దిత్తు.

1) జలగర్భమందడగిన అగ్నిరీతిగ
సస్యమందడగుకొనిన రుచి రీతిగ
మొగ్గలందడిగిన పరిమళము రీతిగ
కూడల సంగమదేవుని ఉనికి కన్య స్నేహమువలెయుండు

జలమునందు అగ్ని అడగికొనియుండు లాగున, మొక్కలందురుచి అడుగుకొనియుండు లాగున , మొగ్గలందు పరిమళము అడగియుండు లాగున పరమాత్ముని ఉనికి ముద్దు బిడ్డపైగల ప్రేమ వలె, కన్యయందడగి యుండు వలపు వలె యుండును. అట్టి పరమాత్ముడు ఆత్మ తత్త్వముచే దేహమునందున్నాడు. "కూడల సంగమదేవ 'అని బసవేశ్వరుడు చేర్చిన మకుటము "పరమాత్ముని" (Supreme God) సంకేతము. నిరాకారుడు నిర్గుణుడు, అయోనిజడు (తల్లిదండ్రుల కడుపులో పుట్టనివాడు). పుట్టుక చావులు లేనివాడు పరమాత్ముడని తెలియవలెను.

# ౧పిండజ్ఞాన స్థలము

## 1

౧) కాళియ కంకాళదిందమున్న,
త్రిపుర సంహార దిందమున్న,
హరివిరించి గళింద మున్న,
ఉమెయ కల్యాణ దిందమున్న,
మున్న మున్న మున్న,
అందిగెళెయ నీను; హళియ నాను.
మహాదాని కూడల సంగమదేవా.

2) కాళి కంకాళము కన్నాముందు,
త్రిపుర సంహారముకన్నా ముందు,
హరి విరించిల కన్నా ముందు,
ఉమాకల్యాణము కన్నాముందు,
ముందు మున్ముందు ఆ ముందు నుండి,
నాటి సఖుడవు నీవు; పురాతనుడ నేను
మహాదానివి కూడల సంగమదేవా.

కాళికాదేవి పుట్టు కన్నా ముందుగా, త్రిపురాసురుని సంహారము జరుగకన్నా ముందుగా, హరిబ్రహ్మాదులకన్నాముందుగా, శివునితో ఉమా కల్యాణము జరుగ కన్నాముందుగా, అంతకన్నా ఎంతో పూర్వమునుండి పరమాత్మా నీవు నా సఖుడవు. కాన నేను అతి పురాతనుడనైన ప్రమథుడను.

## 2

3) అయ్యా, నీను నిరాకారవాగి దర్లల్లి
నాను జ్ఞాన వెంబ వాహన వాగిర్దె కాణా.
అయ్యా, నీను నాట్యక్కె నిందల్లి
నాను చైతన్య వెంబ వాహన వాగిదేా కాణా.

అయ్యా, నీను ఆకారవాగిర్దల్లి
నాను వృషభ నెంబ వాహన వాగిర్దె కాణా
అయ్యా, నీనెన్న భవవ కొందిహనెందు
జంగమ లాంఛనవాగి బందడె
నాను భక్తనెంబ వాహన వాగిర్దె కాణా,
కూడల సంగమదేవా.

3) అయ్యా, నీవు నిరాకారమై యున్నపుడు
నేను జ్ఞానమను వాహనమై యుంటి గనుమా
అయ్యా, నీవు నాట్యమునకు నిలుచుండినపుడు
నేను చైతన్యమను వాహనమైయుంటి గనుమా.
అయ్యా, నీవు ఆకారముతో యున్నపుడు
నేను వృషభుడను వాహనమై యుంటిగనుమా.
అయ్యా, నీవు నా భవముద్రుంచుటకు
జంగమ లాంఛనుడవై రాగ
నేను భక్తుడను వాహనమైయుంటి గనుమా,
కూడల సంగమ దేవా.

పరమాత్మా నీవు నిరాకారముతో యుండినపుడు నేను జ్ఞానమును వాహనముగా యుండియుంటిని. నీవు నటరాజుగా నాట్యము చేయుచూగలపుడు నేను చైతన్యాత్మకమను వాహనముగా యుండియుంటిని. నీవు మహేశ్వరుడను ఆకారముతో యుండినపుడు నేను వృషభుడను వాహనముగా యుండియుంటిని. నీవు నా పాపమును పరిహరించుటకుగాను అల్లమ ప్రభువను జంగమ రూపుడవై వచ్చినపుడు నేను భక్తుడనెడి వాహనమై యుంటిని. బసవేశ్వరుని కాలములో పరశివుని ఆదేశముతో అల్లమ ప్రభవు అను కలియుగ విరక్తుల ఆది నిరంజన జంగముడు జనించి బసవేశ్వరుడు స్థాపించిన అనుభవ మంటపమందలి శూన్య పీఠమునకు ప్రథమ పీఠాధీషుడాయెను. బసవేశ్వరుడు యొక వచనమందు తానొక్కడనే భక్తుడనని మిగతా జనులెల్లరూ శివస్వరూపులని పలికి తన భృత్యాచారమును వెల్లడి చేసెను.

## 3

౪) అయ్యా, ఏళేళు జన్మదల్లి శివభక్తనాగి బారది ర్దడె
నిమ్మాణె, నిమ్మప్రమథరాణె!
నిమ్మ ప్రసాదక్కల్లదె బాయ్దెఱయె నయ్యా.
ప్రథమ భవాంతరదల్లి
శిలాదనెంబ గణేశ్వరనమాడి, హెసరిట్టు కరెదు
నిమ్మ భృత్యనమాడి ఎన్ననిరిసి కొండిర్ది రయ్యా.
ఎరడనెయ భవాంతరదల్లి
స్కందనెంబ గణేశ్వరనమాడి, హెసరిట్టు కరెదు
నిమ్మ కారుణ్యవ మాడిరిసి కొండిర్దిరయ్యా.
మూరనెయ భవాంతరదల్లి
నీలలోహితనెంబ గణేశ్వరనమాడి, హెసరిట్టు కరెదు
నిమ్మ లీలావినోద దిందిరిసి కొండిదిర్ఱరయ్యా
నాల్కనెయ భవాంతరదల్లి
మనోహరనెంబ గణేశ్వరనమాడి, హెసరిట్టు కరెదు
నిమ్మ మనః ప్రేరక నాగలెందిరిసి కొండిర్దిరయ్యా
ఐదనెయ భవాంతరదల్లి
కాలలోచన నెంబ గణేశ్వరనమాడి, హెసరిట్టు కరెదు
సర్వ కాల సంహారవ మాడ లెందిరిసి కొండిర్దిరయ్యా
ఆఱనెయ భవాంతరదల్లి
వృషభనెంబ గణేశ్వరనమాడి, హెసరిట్టు కరెదు
నిమగేఱలు వాహన వాగ లెందిరిసి కొండిర్దిరయ్యా
ఏళనెయ భవాంతరదల్లి
బసవనెంబ గణేశ్వరనమాడి, హెసరిట్టు కరెదు
నిమ్మ ఒక్కుద మిక్కుదక్కె యోగ్యనాగ లెందిరిసి - కొండిర్దిరయ్యా.
ఇదుకారణ కూడల సంగమదేవా,
నీవు బరిసిద భవాంతరదల్లి నాను బరుతిర్దెనయ్యా.

4) ఆయ్యా, ఏడేడు జన్మలందు శివభక్తుడనై రానిచో
నీ ఆన, నీ ప్రమథుల ఆన

నీ ప్రసాదమునకు తప్ప నోరు తెరువనయ్యా.

ప్రథమ భవాంతరమందు

శిలాదుడనెడి గణేశ్వరుని జేసి పేరిడి పిలచి

నీ భృత్యుని గాజేసి నను నిలుపుకొంటివయ్యా.

రెండవ భవాంతరమందు

స్కందుడను గణేశ్వరుని జేసి పేరిడి పిలచి

నీ కారుణ్యము చూపినను నిలుపుకొంటివయ్యా.

మూడవ భవాంతరమందు

నీలలోహితడనెడి గణేశ్వరుని జేసి పేరిడి పిలచి

నీలీలా వినోదమునకై నను నిలుపుకొంటివయ్యా.

నాల్గవ భవాంతరమందు

మనోహరుడనెడి గణేశ్వరుని జేసి పేరిడి పిలచి

నీ మనః ప్రేరకుడుగా నను నిలుపుకొంటివయ్యా.

ఐదవ భవాంతరమందు

కాలలోచనుడనెడి గణేశ్వరుని జేసి పేరిడి పిలచి

సర్వకాలమందు సంహారముచేయ నను నిలుపుకొంటివయ్యా.

ఆరవ భవాంతరమందు

వృషభుడనెడి గణేశ్వరుని జేసి పేరిడి పిలచి

నీ వధిరోహించెడి వాహనముగా నను నిలుపుకొంటివయ్యా.

ఏడవ భవాంతరమందు

బసవడను గణేశ్వరుని జేసి పేరిడి పిలచి

నీ ప్రసాదము గొనెడి యోగ్యునిగా నను నిలుపుకొంటివయ్యా.

ఈ కారణముగ కూడల సంగమదేవా,

నీవు నిర్ణయించిన భవాంతరములందు నేను వచ్చుచుంటినయ్యా

పరమాత్మా నేను ఎత్తిన ఏడు జన్మలందునూ నీ ప్రమాణముగా
నీ ప్రమథుల ప్రమాణముగానేను శివభక్తుడుగానేయుంటూ నీ
ప్రసాదము తప్ప ఇతరమేదియూ నోటితో స్వీకరించలేదు. నా జన్మలందలి
ప్రథమ జన్మలో శిలాదుడనై జన్మించి నీకు భృత్యుడనైతిని
రెండవ జన్మలో స్కందుడనై జన్మించి నీ కరుణకు పాత్రుడనైతిని
మూడవ జన్మలో నీలలోహితుడనై జన్మించి నీ లీలలను ప్రదర్శించితిని.
నాల్గవ జన్మలో మనోహరుడను పేరుతో జన్మించి నీ ఆజ్ఞలను పాలించితిని.
ఐదవ జన్మలో కాలలోచనుడను పేరున జన్మించి సంహారముచేయు
కార్యమును నీ ఆనతిన నిర్వహించితిని.
ఆరవ జన్మలో వృషభుడను పేరున జన్మించి నీవధిరోహించెడి వాహనముగా
యుంటిని.
ఏడవ జన్మలో బసవడను పేరున జన్మించి శివప్రసాదము తప్ప ఇతరమేదియూ
ముట్టని యోగ్యుడైన భక్తునిగా నన్ను నిలిపితివి.
పరమాత్మా ఇవ్విధమున నీవు నిర్ణయించినపుడెల్లా నేను జన్మలను దాల్చితిని.

## 4

ಕ) ಅಯ್ಯಾ, ನಿಮ್ಮ ಶರಣನ ಮರ್ತ್ಯಕ್ಕೆತಂದೆಯಾಗಿ
ನೆನೆ ನೆನೆದು ಸುಖಿಯಾಗಿ ಅನುಬದುಕಿದೆನಯ್ಯಾ.
ಅದೇನು ಕಾರಣ ತಂದೆಯೆಂದಱಿದೆನಯ್ಯಾ
ಎನ್ನ ಕಾರಣ ತಂದೆಯೆಂದಱಿದೆನಯ್ಯಾ
ಅಱಿದಱಿದು ನಿಮ್ಮ ಶರಣನ ಆಚರಿಸುವ ಆಚರಣೆಯ ಕಂಡು
ಕಣ್ದೆಱೆದೆನಯ್ಯಾ, ಕೂಡಲ ಸಂಗಮದೇವಾ.

5) అయ్యా, నీ శరణుని మర్త్యలోకమునకు పంపితివని
తలచి తలచి సుఖముగా నేను బ్రతికితినయ్యా
దేనికై పంపితివో తెలిసితినయ్యా
కారణజన్మునిగా పంపితివని తెలిసితినయ్యా
తెలిసి తెలిసి నీ శరణుడాచరించెడి ఆచరణనుగాంచి
కనులు తెరచితినయ్యా, కూడల సంగమదేవా 5

పరమాత్మా నీవే నను భువిపై జన్నింపజేసితివని నేను ఎరిగిన వాడనైన కారణముగా ఏచింతయూలేక సుఖముగా యుంటిని. ఏ పనికై పంపితివో గ్రహించితిని. కారణజన్ముగా నను పంపితివని ఎరిగితిని. ఇవన్నీ తెలిసియూ శివశరణులా చరించెడి ఆచరణలను జూచి జ్ఞానోదయము కలిగెనయ్యా.

**5**

౬) కరిఘనః అంకుశ కిఱుదెన్న బహుదె? బారదయ్యా;
గిరఘనః వజ్ర కిఱుదెన్న బహుదె? బారదయ్యా;
తమంద ఘనః జ్యోతి కిఱుదెన్న బహుదె? బారదయ్యా;
మరహుఘన ః నిమ్మ నెనెవ మన కిఱుదెన్న బహుదె?
బారదయ్యా, కూడల సంగమ దేవా

6) **కరిఘనము అంకుశము అల్పమనదగునా? తగదయ్యా**
**గిరి ఘనము వజ్రము అల్పమనదగునా? తగదయ్యా**
**చీకటి ఘనము జ్యోతి అల్పమనదగునా? తగదయ్యా**
**మరపు ఘనము నిను స్మరించెడి మనము అల్పమనదగునా**
**తగదయ్యా, కూడల సంగమదేవా.**

చిన్నదైనా అంకుశము ఏనుగుకన్నా శక్తివంతము. అలాగుననే చిన్నదైనా వజ్రము పర్వతముకన్నా శక్తివంతము. అదే విధమున చిన్నదైన ప్రకాశము విశాలమైన చీకటిని హరించు శక్తి గలిగియుండును. పరమాత్మా నిన్ను స్మరించెడి మనస్సు చిన్ననిదైనా మరపను చీకటిని పారద్రోలును.

పరమాత్ముని స్మరించుటలో దురితములు దూరమగును. జ్ఞానోదయము కలుగును. ధీరుగనడచే ఆత్మబలము కలుగును.

# 3. సంసార హేయస్థలము

## 1

౬) భవబంధన భవపాశవాద కారణవేనయ్యా?
హిందణ జన్మదల్లి లింగవ మరెదనాగి,
హిందణ సిరియల్లి జంగమవ మరెదనాగి,
అరుదడీ సంసారవ హొద్దలీవెనె,
కూడల సంగమదేవా?

7) భవబంధనము భవపాశమైన కారణమేదయ్యా
వెనుకటి జన్మమందు లింగమును మరిచినందున
వెనుకటి జన్మమందు జంగముని మరచినందున
తెలిసితిని సంసారపు మరపును
కూడల సంగమదేవా?

పాపమనెడి బంధము పాశమై ననుచుట్టిన కారణమేమని నన్ను నేను ప్రశ్నించుకొనినచో వెనుకటి జన్మలో లింగమును, జంగముని మరచితినని తెలిసితిని. పరమాత్మా సంసారపు మరపులో ఈ తప్పిదములు చేసితిని.

## 2

కప్పెసర్పన నెళలల్లిప్పం తెనగాయిత్తయ్యా!
ఆకటకటా, సంసార వృథాహోయిత్తల్లా!
కర్తువే కూడల సంగమదేవా,
ఇవ తప్పిసి ఎన్నువ రక్షిసయ్యా.

కప్ప పాము నీడయందుండలాగున నా బ్రతుకాయెనయ్యా!
అకటకటా సంసారము వృథా అయిపోయెనే!
కర్తుడా కూడల సంగమదేవా,
దీని నుండి తప్పించి నను రక్షింపుమయ్యా,

8

పాము నీడలో కప్ప ఎంత కాలము బ్రతుకగలదు. నా బ్రతుకు ఈ సామెతలాగున వృథాయగుచూపోవుచున్నది. సృష్టికర్తవగు పరమాత్మా ఈ ప్రమాదమునుండి నను తప్పించి రక్షింపుము.

## 3

౯) సంసారవెంబ బలెయల్లి సిలుకిదెనయ్యా
ఎన్నువను కాయయ్యా, కాయయ్యా
హురుళిల్ల హురుళిల్ల!
కూడల సంగమదేవా, శివధో! శివధో!

9) **సంసారమనెడి వలలో చిక్కితినయ్యా**
**నను కాపాడుమయ్యా, కాపాడుమయ్యా**
**పసలేదు పసలేదు!**
**కూడల సంగమదేవా, శివ శివా! శివ శివా!**

సంసారమను వలలో చిక్కితిని ఈ వలనుండి నన్ను కాపాడుము. సారము లేనిదీ సంసారము. శివ శివా పరమాత్మా నన్ను రక్షింపుము.

## 4

౧౦) నానొంద నెనెదడె తానొంద నెనెవుదు.
నానిత్త లెళెదడె తానత్త లెళెవుదు.
తాబేరె ఎన్ననళలిసి కాడిత్తు.
తాబేరె ఎన్న బళలిసి కాడిత్తు.
కూడల సంగన కూడిహనెందడె,
తానెన్న ముందుగెడిసిత్తుమాయె!

10) **నేనొకటి తలచిన తానొకటి తలచు**
**నేనీకడ ఈడ్చిన తానాకడ ఈడ్చును.**
**తాను వేరగుచు నన్నడలించి కాడించు**
**తాను వేరగుచు నన్నువేధించి కాడించు**

కూడల సంగని చేరుకొనెదనందునా?
తాను నన్ను ముందుగా చెడచునుమాయ!

మాయ ఎల్లప్పుడూ మనుజులను ఆవరించి యుండి చెరచుచుండును. అదెలాగన నేనొకటి అనుకొనిన తానొకటనుకొనును. నేను ఈ చివరకు లాగిన తాను అచివర కు లాగును. ఈ మాయ నన్నుఎల్ల వేళలా కాడించి వేధించుచుండును. పరమాత్మని చేరుకొను ఇచ్ఛగల నాకు మాయ అడ్డుగా నిలచినది.

**5**

౧౧) జని తక్కె తాయాగి హెత్తళు మాయె
మోహక్కె మగువాగి హుట్టిదళుమాయె
కూటక్కె స్త్రీయాగి కూడిదళుమాయె
ఇదావావ పరియల్లి కాడిత్తు మాయె
ఈ మాయెయ కళెవడె ఎన్నళవల్ల,
నీవే బల్లిరి కూడల సంగమదేవా!

జన్మమునకు తల్లియై కనినది మాయ
మోహమునకు బిడ్డయై పుట్టినది మాయ
కూటమికి స్త్రీయౌచు కూడినది మాయ
నానావిధముల నన్ను కాడించు మాయ
ఈ మాయను దాటగ నా తరము గాదు
నీకే తెలియు కూడల సంగమదేవా!

జన్మించిని దాదిగా మాయ వెన్నంటియుండును. జన్మకు తల్లిగా మోహమునకు బిడ్డగా పుట్టినట్టిదీమాయ. కూటమికి స్త్రీ రూపున వెలసి కూడు చుండును మాయ. మనుజుని నానా విధములుగా ఆడించుచుండును ఈ మాయ. అట్టి ఈ మాయను గెలుచుట ేంకష్టతరము. దాటుటను పరమాత్ముడు మాత్రమే ఎరుగును.

## 6

౧౨) దిటపుట భకుతి సంపుట నెలెగొళ్ళదాగి -
టింబకన నాడిసుతి ద్దిత్తయ్యా నిన్నమాయె;
టీవక టింబకన నాడిసుద్దిత్తయ్యా నిన్నమాయె
కూడల సంగమదేవయ్యా!
హోన్ను, హెణ్ణు, మణ్ణ తోరు!

12) **దృఢమగు భక్తి స్థిరముగా యుండుటకు,**
**టింబకునిగా ఆడించు చుండునయ్యా, నీ మాయ.**
**టింగు టింగున ఆడించు చుండునయ్యా, నీ మాయ**
**కూడల సంగమదేవయ్యా,**
**కాంచనము, కాంత, భూముల ఆశ చూపించకుము.**

భగవంతునిపై దృఢమగు భక్తి గలిగి అది స్థిరముగా యుండవలెనని నన టింబకునిగా టింగు టింగుమంటూ ఆడించుచుండును మాయ. పరమాత్మా! ధనము, స్త్రీ, పొలము ఆశలునను కలచివేయుచున్నవయ్యా

## 7

౧౩) ఎన్న నడెయొందుపరి; ఎన్న నుడియొందుపరి,
ఎన్నొళగేను శుద్ధవిల్ల నోడయ్యా
నుడిగి తక్క నడెయ కండడె
కూడల సంగమదేవ నొళగిప్పనయ్యా.

13) **నానడత యొకరీతి; నానుడి యొకరీతి;**
**నాయందేమీ శుచిలేదు కనుమయ్యా.**
**నుడికి తగిన నడతను గాంచిన**
**కూడల సంగమదేవుడు మెచ్చునయ్యా.**

నానడత యొకరీతిగా నానుడి మరొక రీతిగా యుండుకారణమున న యందు పవిత్రత లేదు. నుడికి తగిన నడతను గలవారలనే పరమాత్ముడు మెచ్చును

## 8

౧౪) అంగద నోటపు సింగద గాత్రవు;
హింగద మనదల్లి నానావికారవు.
బందెనెందఱియ లిక్కిల్లాగి సందేహ బిడదు;
ముందుగాణదు లోక
బెంద మాయక్కంజి నిమ్మ మఱువొక్కె
కూడల సంగమదేవా

14) అంగపు చూపు సింగారపు గాత్రము
పుట్టించు మనమందు నానా వికారము
పుట్టి తినను జ్ఞానము లేదు సందేహము విడువదు
ముందు కానదు లోకమును
జగతిమాయకు వెరచి నీ శరణు జొచ్చితి
కూడల సంగమ దేవా.

మనుజులందు అందమైన రూపము, ఇంపైన గాత్రము గలవారలను గాంచిన వారిపై మోహము కలిగి మనస్సునందు నానా వికారము పుట్టును. ఇది వ్యామోహము అనెడి జ్ఞానమును పొందవలెను. లేనిచో లోకమును మరపించి మనస్సు తప్పిదములు చేయించును. జగత్తున గల మాయకు భయపడుచూ నీ శరణు వేడెదనయ్యా పరమాత్మా!.

## 9

౧౫) నరవింధ్య దొళగెన్న హులు గిళియమాడి సలహుత్త
'శివ శివా' ఎందోది సయ్యా
భక్తి ఎంబ పంజర దొళగిక్కి సలహు
కూడల సంగమదేవా.

15) నరవింద్యారణ్యమున నన్నొక చిలుకను జేసి సాకుతూ,
శివ శివా యని అనిపించుమయ్యా,

భక్తి యనెడి పంజరము నందుంచి సాకుము,
కూడల సంగమదేవా. 15

జనుల మధ్యన బ్రతుకుట మహాకష్టతరము. వారి అభిరుచి, ఆచారవిచారములు, వ్యవహారము అంతా ఒక మాయా జాలము. అందుకై నన్నొక చిలుకను జేసి భక్తి యనెడి పంజరము నందుంచుము. పంజరము నుండి రక్షణపొంది "పరశివా పరమాత్మా" అని నీ ధ్యానము చేయుచు నెమ్మదిగాయుండెదను.

## 10

೧೬) ఇవనారవ, ఇవనారవ, ఇవనారవ నెందెనిసదిరయ్యా;
ఇవనమ్మవ, ఇవనమ్మవ, ఇవనమ్మవ నెందెనిసయ్యా
కూడల సంగమదేవా,
నిమ్మమనెయ మగనెందెనిసయ్యా,

16) ఇతడెవరు, ఇతడెవరు, ఇతడెవరని అనిపించకయ్యా;
ఇతడు నావాడు, ఇతడు నావాడు, ఇతడు నావాడని అనిపించుమయ్యా.
కూడల సంగమదేవా,
నీ మహాగృహపు బిడ్డగా ఎంచుమయ్యా.

తోటి మానవులు ఒకరినొకరు గాంచి అసహ్యించుకొనుట పశుస్వభావము. ఒకరిని చూచి యొకరు నా వాడని భావించవలెనే గాని పరుడను భావము వహింపరాదు. ఎల్లరూ పరమాత్ముని బిడ్డలేయని తెలియవలెను.

## 11

೧೭) నీ నొలిదడె కొరడు కొనరువుదయ్యా
నీ నొలిదడె బరడు హయనహుదయ్యా
నీ నొలిదడె విషవెల్ల అమృత వహుదయ్యా
నీ నొలిదడె సకల పడిపదార్థ
ఇదిరల్లిర్పుపు కూడల సంగమదేవా.

17) నీవు మెచ్చిన మ్రోడు చిగురించునయ్యా
నీవు మెచ్చిన గొడ్డు పాలిడునయ్యా
నీవు మెచ్చిన విషము అమృతమగునయ్యా
నీవు మెచ్చిన సకల పడిపదార్థములు
ఎదుట నిల్చును కూడల సంగమదేవా

పరమాత్ముని కృప కలిగినచో ఎండిన చెట్టు చిగురువేయును, గొడ్రాలగు పశువు పాలిచ్చును. విషము అమృతముగా మారును, తలచినంతనే ఏ పదార్థమైననూ బడయుట జరుగును. కావున పరమాత్ముడు మెచ్చు విధమున అలవాట్లు గలిగి యుండవలెను.



# 4. గురు కరుణ స్థలము

1

౧౮) మడకెయ మాడువడె మణ్ణె మొదలు;
తొడగియ మాడువడె హొన్నె మొదలు;
శివపథ నఱువడె గురుపథవె మొదలు
కూడల సంగమ దేవర నఱువడె
శరణర సంగవె మొదలు.

18) కుండలు చేయగ మన్ను కావలె
నగలు చేయగ బంగరు కావలె
శివపథ మఱయుటకు గురుపథము వలయు
కూడల సంగమ దేవుని తెలియగ....
శరణుల సంగము వలయు

కుమ్మరి పనివాడు కుండలు చేయవలెననిన ప్రత్యేకించిన మన్ను అవసరము. అవుసలి వృత్తివారు నగలు (ఆభరణములు) చేయవలె ననిన బంగారము అవసరము. అవ్విధముగా పరమాత్ముని ఉనికి తెలియవలెననిన గురుముఖముగానే సాధ్యమగును. అట్టి నిజగురుని ఆరియవలెను. పరమాత్ముని గూర్చి తెలిసికొనవలెనను ఇచ్ఛగలవారు శరణుల సాంగత్యము (సత్సాంగత్యము) చేయవలెను.

# 5 విభూతి స్థలము

## 1

౧౯) నీరింగె నైదిలియె శృంగార;
సముద్రక్కె తెరెయె శృంగార;
నారిగె గుణవె శృంగార;
గగనక్కె చంద్రమనె శృంగార;
నమ్మకూడల సంగన శరణరిగె
నొసల విభూతియె శృంగార.

19) **నీటికి కలువే శృంగారం;**
**సముద్రముకు అలయే శృంగారం;**
**నారికి గుణమే శృంగారం;**
**గగనముకు చంద్రుడు శృంగారం;**
**మా కూడల సంగని శరణులకు**
**నొసట విభూతియె శృంగారం.**

సరస్సులందలి నీటిలో కలువపూలు గలచో ఆ నీటికి అందము వచ్చును. సముద్రము నందు అలలు పుట్టినపుడే దాని అందము హెచ్చును. స్త్రీలు మంచిగుణమును కలిగియున్నచో వారి అందము హెచ్చును. చంద్రుని వలన ఆకాశము అందముగా అగుపించును. ఆదేవిధముగా పరమాత్ముని కృప కావలెననెడి శరణులు తప్పని సరిగా నొసట విభూతిని ధరింప వలెను. విభూతి ధరించిన నొసలు గలవారు అందముగా కనపడుటేకాక పరమాత్మునికి ప్రీతిపాత్రులగుదురు.

# 6. పంచాక్షరి స్థలము

## 1

౨౦) కరియంజువుదు అంకుశక్కయ్యా!
గిరియంజువుదు కులి శక్కయ్యా!
తమంధ వంజువుదు జ్యోతిగయ్యా!
కాననవంజువుదు బేగెగయ్యా!
పంచమహాపాతక వంజువుదు
కూడల సంగన నామక్కయ్యా

20) కరి జంకునది అంకుశమునకయ్యా
గిరిజంకునది కులిశమున కయ్యా
చీకటి జంకునది జ్యోతికయ్యా
అడవి జంకునది నిప్పుకయ్యా
పంచమహాపాతకము జంకునది
కూడల సంగని నామమునకయ్యా

బలమైన ఏనుగు అంకుశమునకు జంకును. పర్వతము కులిశమునకు జంకును. ప్రకాశమునకు చీకటి జంకి పారిపోవును. చెట్టుచేమలు గల దట్టమైన అడవి కార్చిచ్చువలన పాడగును. పరమాత్ముని నామస్మరణకు పంచమహాపాతకములు గూడా తొలగును. "నమఃశివాయ" అనిగాని "లింగాయ నమః" అని గాని పంచాక్షరములు గల మంత్రము జపించిన సర్వదురితములు తొలగును.

## 2

౨౧) ఎమ్మవరు బెనగొండడె శుభలగ్న వెన్నిరయ్యా;
రాశికూట గణ సంబంధవుంటెందు హేళిరయ్యా;
చంద్రబల తారాబల వుంటెందు హేళిరయ్యా;
నాళినదిన కిందిన దిన లేసెందు హేళిరయ్యా;
కూడల సంగమ దేవన పూజసిద ఫల నిమ్మదయ్యా!

21) మా వారు ప్రశ్నింపగ శుభలగ్నమని తెలియుడయ్యా
రాశికూటము గణసంబంధము గలదా? తెలుపుడయ్యా
చంద్రబలము తారాబలము గలదా? తెలుపుడయ్యా
రేపటి దినము కన్నా నేటి దినము మేలని దెలుపుడయ్యా
కూడల సంగమదేవుని పూజించిన ఫలము మీదేనయ్యా

పరమాత్ముని పూజించెడి శరణులకు అంతాశుభలగ్నమని తెలియుడు రాశికూటము గణములను అరయుట అవసరముండదు. చంద్రబలము తారాబలము చూచు అవసరముండదు. ఇవన్నీ వారికి తమకు తామైయుండును. రేపటి దినము కన్నా నేటి దినము శుభదినమని తెలియవలెను. పరమాత్ముని పూజించువారలకు శుభఫలములు తమకు తామై అబ్బును. కావున అనేక దేవీదేవతలను (Goddesses & Gods) పూజించుట కన్నా నిరాకార పరమాత్ముని (Supreme God) పూజించిన వారలకు అనునిత్యము శుభఫలములు కలుగును.

# 7. లింగధారణ స్థలము

1

౨౨) అడ్డ విభూతి యిల్ల దవరముఖ హొల్ల, నోడలాగదు;
లింగదేవ నిల్లదతావు నరవింధ్య, హోగలాగదు;
దేవ భక్తరిల్ల దూరు సినె, హాళు!
కూడల సంగమదేవా.

22) అడ్డ విభూతి పెట్టని వారి ముఖము చూడరాదు, చూపకుము
లింగదేవుడు లేని స్థలము అడవి వంటిది, పోతగదు
దేవుని భక్తులు లేని ఊరు కాడు, బీడు!
కూడల సంగమదేవా

22

నొసట అడ్డముగా విభూతి ధారణ చేయని వారి ముఖమును చూచుటకు నామనస్సు ఒప్పదు. అట్టి వారిని నా ఎదుటకు రాకుండా చూడుము, పరమాత్మ

రూపుతో శివుని మందిరం (లింగదేవుడు) లేని స్థలమునరారణ్యాము వంటిది. అట్టిచోటునకు పోతగదు. శరణులు అనగా ఎల్లపుడు దైవచింతనగలిగి సత్కర్మాచరణము చేయు వారు లేని ఊరు స్మశానము, బీడు పొలము వంటిది.

# 8. తామస నిరసన స్థలము

## 1

౨౩) అర్థరేఖె యిద్దల్లి ఫలవేను; ఆయుష్యరేఖె ఇల్ల దన్నక్క?
హందెయ కైయల్లి చంద్రాయుధవిద్దు ఫలవేను?
అంధకన కైయల్లి దర్పణ విద్దు ఫలవేను?
మర్కటన కైయల్లి మాణిక్య విద్దు ఫలవేను?
నమ్మ కూడల సంగన శరణర నఱియ దవర్కైయల్లి
లింగ విద్దు ఫలవేను, శివపథవ నఱియదన్నక్క!

**23) అర్థరేఖ యున్న ఫలమేమి; ఆయుష్యరేఖ లేకున్నచో?**
**పందచేతిలో చంద్రాయుధమున్న ఫలమేమి?**
**అంధుని చేతిలో అద్దమున్న ఫలమేమి?**
**మర్కటము చేతిలో మాణిక్యమున్న ఫలమేమి?**
**మాకూడల సంగని శరణుల తెలియని వారి చేతిలో లింగమున్న ఫలమేమి?**
**శివపథము తెలియనటులైన!**

వ్యక్తి యొద్ద చాలినంత ధనమున్న ఏమి ఫలము, అతడికి అనుభవించుటకు అవసరమగు ఆయుష్యులేకుండెనేని? పిరికి పంద చేతిలో అత్యమూల్యమైన చంద్రాయుధమున్న ఫలమేమి? అంధుని చేతిలో అద్దమున్న ఫలమేమి? మర్కటము (కోతి) చేతిలో విలువైన మా ణిక్యమున్న ఫలమేమి? శరణులగు వారిని గుర్తించని వారి చేతిలో లింగమున్ననూ వృథాయే. నిజవస్తువగు పరమాత్ముని అట్టివారు తెలిసికొనలేరు.

2

౨౪) గండన మేలె స్నేహ విల్లద హెండతి
లింగదమేలె నిష్ఠెయిల్లద భక్త
ఇద్దడేను, శివశివా హోదడేను?
కూడల సంగమ దేవయ్యా,
ఉడద అవింగె ఉణ్ణద కఱువ బిట్టంతె!

24) పతిపై వలపులేని సతి
లింగముపై నిష్ఠలేని భక్తుడు
యున్ననేమి, శివశివా లేకున్న నేమి?
కూడల సంగమదేవయ్యా,
సేపిడని ఆవుకు త్రాగు దూడను విడిచినటులయ్యా.

భర్తపై మక్కువలేని భార్య, ఇష్టలింగముపై శ్రద్ధాభక్తులు లేని భక్తుడు యున్న నేమి, లేకున్న నేమి? పరశివా పరమాత్మా పాలివ్వని ఆవుకు పాలు త్రాగు దూడను విడిచినటులగును గదయ్యా

# 9. జ్ఞాన స్థలము

1

౨౫) కామవేకో, లింగప్రేమియెని సువంగె?
క్రోధవేకో, శరణవేద్య నెనిసువంగె?
లోభవేకో, భక్తియలాభవ బయసువంగె?
మోహవేకో, ప్రసాద వేద్య నెనిసువంగె?
మద మత్సర వుళ్ళవంగె హృదయ శుద్ధ వెల్లియదో?
హదుళిగరాదల్లిప్ప నమ్మ కూడల సంగమదేవ!

25) కామ మేటికో, లింగప్రియుడగువానికి
క్రోధమేటికో, శరణ వేద్యుడగువానికి
లోభమేటికో, భక్తి లాభము కోరెడి వానికి

మోహమేటికో, ప్రసాద వేద్యుడగువానికి
మదమత్సరములుండువానికి, హృదయ శుద్ధి యెక్కడిది
తృప్తులగు వారలందుండు మా కూడల సంగమదేవుడు

ఇష్టలింగమును భక్తితో పూజించు పరమాత్ముని భక్తునకు కామ, క్రోధ, లోభ, మోహ, మద, మత్సరములను మదములు యుండతగదు. ఇవియున్నచో చిత్తశుద్ధియుండదు. ఇవియుండని వారలందు పరమాత్ముని కృప హెచ్చుగా యుండును.

## 2

೨೬) లోకదడొంక నీవేక తిద్దువిరి?
నిమ్మ నిమ్మ తనువ సంతైసికొళి.
నిమ్మ నిమ్మ మనవ సంతైసి కొళి.
నెరెమనెయ దుఃఖక్కె అళువర మెచ్చ
కూడల సంగమదేవ!

26) లోకపు తప్పును మీరెందులకు దిద్దెదరు
మీమీ తనువులను సరిజేసికొనుడు
మీమీ మనములను సరిపరచుకొనుడు
పొరుగింటి వారల దుఃఖములకు ఏడ్చెడి వారలను మెచ్చడు
కూడల సంగమ దేవుడు

లోకమునందలి జనులు అనేక తప్పిదములు చేసెదరు, వారిని సరిజేయుట కన్నాముందుగా మీ తనువును, మనమును శుద్ధమొనర్చుకొనుము. పొరుగింటి వారల వెతలకు ఏడ్చెడివారలను పరమాత్ముడు మెచ్చడు.

## 3

೨೭) సారసజ్జనర సంగ లేసు కండయ్యా
దూర దుర్జనరసంగ భంగవయ్యా,

సంగవెరడుంటు; ఒందుహిడి, బందు బిడు.
మంగళమూర్తి నమ్మ కూడల సంగన శరణర.

27) సారసజ్జనుల సంగము మేలు కనుమయ్యా
దూరదుర్జనుల సంగము వలదయ్యా
స్నేహములు రెండు, ఒకటి చేపట్టు మరొకటి విడువు
మంగళమూర్తి మాకూడల సంగని శరణుడు

సజ్జనులతోనే సహవాసము చేయవలెను. దుర్జనులతో స్నేహము భంగపాటు కలిగించును. స్నేహములు రెండు విధములుగా యుండును. యొకటి మేలొనరిపంగా, మరొకటి కీడొనర్చును. పరమాత్ముని కృప బడసిన శరణులు మంగళమూర్తులు.

# 4

౨౮) లేసెనిసికొండు అయ్దు దిన బదుకిదడేను?
లేసెనిసికొండు నాల్కుదిన బదుకిదడేను?
లేసెనిసి కొండు మూఱుదిన బదుకిదడేను?
లేసెనిసి కొండు ఎరడు దిన బదుకిదడేను?
కూడల సంగన శరణర వచనదల్లి
లేసెనిసి కొండు ఒందు దిన బదుకిదరె సాలదె?

28) మంచివాడనిపించుకొని ఐదురోజులు బ్రతికిన చాలును
మంచివాడనిపించుకొని నాల్గురోజులు బ్రతికిన చాలును
మంచివాడనిపించుకొని మూడు రోజులు బ్రతికిన చాలును
మంచివాడనిపించుకొని రెండు రోజులు బ్రతికిన చాలును
కూడల సంగని శరణుల వచనమందు
మంచివాడనిపించుకొని ఒక్క రోజు బ్రతికినా చాలు

'మంచి' వారుగా అనిపించుకొని సార్థకమైన బ్రతుకుతో ఐదురోజులు, నాల్గురోజులు, మూడురోజులు, రెండు రోజులు చివరకు ఒక్కరోజు బ్రతికినాచాలు. ఎల్లర దృష్టిలో

మంచివాడుగా అగు పించవలెను. పరమాత్ముని కృపగల శరణుల దృష్టియందునూ అలాగేయుండవలెను.

## 5

౨౯) మత్య్రాలోక వెంబుదు కర్తారన కమ్మటవయ్యా;
ఇల్లిసల్లువవరు అల్లియూ సల్లువరయ్యా;
ఇల్లి సల్లదవరు అల్లియూ సల్లరయ్యా
కూడల సంగమదేవా.

29) మర్త్యలోక మనునది కర్తారుని కమ్మటమయ్యా
**ఇచట చెల్లెడివారు అచ్చటా చెల్లెదరయ్యా**
**ఇచట చెల్లని వారు అచ్చటా చెల్లరయ్యా**
**కూడల సంగమదేవా**

మర్త్యలోకమనెడి ఈ భూలోకము సృష్టికర్త పరమాత్ముని యొక్క కర్మాగారము, కార్యాగారము. ఈ భూలోకమున మెప్పుపొందునటుల బ్రతికిన సృష్టికర్త యొద్దనూ మెప్పును బడసెదరు. ఇచట చెల్లనటులుగా బ్రతికిన అచ్చటా చెల్లుట సాధ్యము కాదు.

## 6

౩౦) నరె కెన్నెగె తెరె గల్లకె, శరీర గూడు పోగదమున్న,
హల్లు హోగి, బెన్నుబాగి, అన్యరిగె హంగాగద మున్న,
కాలమేలె కైయ నూఱి కోలహిడియదమున్న,
ముప్పిం దొప్పవళియదమున్న, మృత్యుముట్టదమున్న
పూజిసు కూడల సంగమదేవన

30) చెక్కిలి నెరసి చిబుకమలలై శరీరము గూడు కాకముందుగా
దంతములూడి, మేనువంగి, పరులనాశ్రయింపకన్నాముందుగా
కాళ్ళపై చేతులాన్చి కోల పట్టకన్నాముందుగా
ముప్పుముంచుక రాకముందు, మృత్యువు ముట్టకముందు
పూజించు కూడల సంగమ దేవుని

చెంపలపై తెల్లని వెంట్రుకలు కనిపించి, గదువ ముడతలై, శరీరము గూడుగుటకు ముందుగా, పళ్లు ఊడి, వెన్నెముక వంగుటతో శరీరము వంగి, పరులను ఆశ్రయింపకన్నాముందుగా, కాళ్ళపై చేతులానించి లేస్తూ, చేతియందు కోల కట్టెను పట్టినడవ కన్నా ముందుగా, వృద్ధాప్యముపైబడి శక్తి, సౌందర్యము కోల్పోకముందే, మృత్యువురాకన్నాముందుగా అను నిత్యమూ పరమాత్ముని పూజింపుము.

## 7

೩೦) నీరబొబ్బుళికెగె కబ్బునద కట్టుకొట్టు
సురక్షితవ మాడువ భరవ నోడా!
మహాదాని కూడల సంగమదేవన పూజిసి
బదుకు ఓ కాయవ నిశ్చైసదె.

31) **నీటి బుడగను, ఇనుప చక్రములో బంధించి**
**సురక్షిత మొనర్చు విధమును చూడుము**
**మహాదాని కూడల సంగమదేవుని పూజించి**
**బ్రతుకును సార్థక మొనర్చు కొనుము**

నీటి బుడగలను ఇనుముతో కట్టలు గట్టి భద్రపరచిన అవి పగలుటకు క్షణము పట్టదు. అలాగుననే బుద్బుదము వంటి శరీరమును అలరించి దాని సుఖమునకు కాలమును వ్యర్థము చేయుట తగదు. నిజమైన బ్రతుకు సార్థకతకు పరమాత్ముని పూజింపుము.

## 8

೩೨) అద్యరవచన పరుష కండణ్ణా;
సదాశివనెంబ లింగవ నంబువుదు;
నంబలొడనె నీ విజయ కండణ్ణా
అధరక్కెకహి, ఉదరక్కెసిహి
కూడల సంగన శరణర వచన బేవసవిదంతె

32 ఆద్యుల వచనము పరుషువు కదయ్యా
సదాశివుడను లింగమును నెరనమ్ముము
నమ్మినంతనే యశము కలుగునయ్యా
అధరమునకు చేదు ఉదరమునకు తీపి
కూడల సంగని శరణుల వచనములు అమృతము వంటివి.

ఆద్యులనగా ఆది శరణులు (బసవేశ్వరుడు ఆది ప్రమథుడుగా వారి సమకాలీనులు) నుడివిన పలుకులే బంగారము. అవి నిజమైన దేవుని (పరమాత్మని - Supreme God) నమ్ముటను నేర్పును. నమ్మినంతనే యశస్సు లభించును. శరణుల మాటలు అమృతము వంటివి. జిహ్వకు వొగరనిపించినా జీవనమునకు బహుతీపి.

## 9

33) సుప్రభాత సమయదల్లి అర్తియల్లి లింగవనెనెదడె,
తప్పువువు అపమృత్యు కాలకర్మంగళయ్యా.
దేవ పూజియ మాటె, దురిత బంధన దోట!
శంభునిమ్మయ నోట, హింగద కణ్బేట!
సదాసన్నిహితనాగి శరణెంబువుదు, నంబువుదు.
జంగమార్చనెయమాట కూడల సంగన కూట!

33) సుప్రభాత సమయమందు దృఢభక్తిన లింగమును పూజింప,
తప్పును అపమృత్యు కాలకర్మములయ్యా,
దేవుని పూజింపగ దురిత బంధములు తొలగును.
శంభో నీయందు చూపులుడగని, శ్రద్ధకలుగని
సదాసన్నిహితుడనై శరణందును, నమ్ముదును
జంగమార్చన యనుమాట కూడల సంగని సన్నిధి చేర్చును.

సుప్రభాత సమయమునందు భక్తి, ప్రీతి, నిష్ఠలచే మనః స్ఫూర్తిగా ఇష్టలింగమును పూజించినచో అపమృత్యువు - కష్టకార్పణ్యములు తప్పును. దేవుని పూజంచుట వలన దురితములు దూరమగును. తదేక దృష్టితో ఇష్టలింగమును వీక్షించుట,

పరమాత్ముని యందు అనన్య శ్రద్ధయుంచుట, జంగమార్చన చేయుట ఇవియే దేవుని మెప్పించు సాధనలు అలా చేయువారు పరమాత్ముని సన్నిధిని చేరుకొనెదరు.

## 10

౩౪) తన్నాశ్రయద రతిసుఖవను, తానుంబ ఊటవను
ಬేజే మత్తొబ్బరకైయల్లి మాడిస బహుదె?
తన్న లింగక్కె మాడువ నిత్యనేమవ తామాడబేకల్లదే
బేజేమత్తొబ్బరకైయల్లి మాడిస బహుదె?
కెమ్మన ఉపచారక్కె మాడువరల్లదె,
నిమ్మనెత్తబల్లరు కూడల సంగమదేవా?

34) **తన ఆశ్రయపు వారి రతిసుఖమును, తాను తినెడి భోజనమును**
**వేరు మరొకరిచే చేయింపదగునే?**
**తన లింగమునకు చేసెడి నిత్యనియమముతాజేయవలెగాని వేరొకరి**
**చేతితో చేయింపదగునే**
**వృథా ఉపచారమునకు చేసెడి వారలు**
**నిన్ను తెలియలేరు కూడల సంగమ దేవా?**

తన ఆశ్రయము నందుగల వారితో రతి సుఖము, తాను తినెడి భోజనము వలన తనకు తృప్తి కలుగను. ఇట్టి పనులనే వేరె మరొకరు చేసిన తృప్తి వారలకు కలుగనే కాని తనకు కలుగదు. అందుచే తన ఇష్టలింగమునకు తాను నిత్యము చేసెడి పూజ వలన తనకు ఫలము కలుగును. వేరితరులు చేసెడి పూజల ఫలితము తనకెలా కలుగును. నిష్ఠతో కాక, నేమమున కని పూజచే సెడివారు నిన్ను తెలియలేరు పరమాత్మా.

## 11

౩౫) కల్ల నాగర కండడె హాలనెజె యెంబరు;
దిటద నాగర కండడె కొల్లెంబరయ్యా!
ఉంబ జంగమ బందడె నడె యెంబరు;

ఉణ్ణద లింగక్కె బోనవ హిడియెంబరయ్యా!
నమ్మకూడల సంగన శరణర కండు ఉదాసీనవ మాడిదడె,
కల్ల తాగిదమిట్టె యంతప్పరయ్యా.

**జాతి నాగుల జూచిన పాలు పోయు మనెదరు**
**జాతి నాగుల జూచిన చంపుమనెదరయ్యా**
**తినెడి జంగముడు వచ్చిన పోపొమ్మనెదరు**
**తినని లింగమునకు బోనమిడెదరయ్యా**
**మాకూడల సంగని శరణుల గాంచియూ ఉదాసీనముగా యున్న**
**రాతికి తాకిన మట్టి పెళ్ళవలె పగులుదురయ్యా** 35

నాగుల పంచమి రోజునభక్తితో రాతిపై చెక్కిన నాగులకు పాలను పోయుదురు. అట్టివారే నిజమగు పాము కనిపించిన చంపుమందురు. జంగముడింటికి వచ్చిన పోపొమ్మను వారే గుడియందలి తినని లింగమునకు నైవేద్యముపెట్టుదరు. పరమాత్ముని కృపగల శరణులను (సత్పురుషులను) చూచియు చూడనటులగా యుండు వారల జీవనము రాతిని తాకిని మట్టి పెళ్ళవలె వ్రక్కలగును.

## 12

పాపియధన ప్రాయశ్చిత్తక్కల్లదె సత్పాత్రక్కె సల్లదయ్యా!
నాయ హాలు నాయిగల్లదె పంచామృతక్కె సల్లదయ్యా!
నమ్మకూడల సంగన శరణరి గల్లదె
మాడువ అర్థ వ్యర్థ కండయ్యా.

**పాపి ధనము ప్రాయశ్చిత్తమునకే గాని సత్పాత్రకు చెల్లదయ్యా**
**కుక్క పాలు కుక్కకు గాక పంచామృతమునకు చెల్లదయ్యా**
**మా కూడల సంగని శరణులకు గాక**
**చేసెడి వ్యయము వ్యర్థము గనుమయ్యా**

పాపము చేసిన వారి వద్దగల ధనము, వారిప్రాయశ్చిత్తమునకు వ్యయమగునే గాని మంచిపనులకు వినియోగము కాదు; కుక్కపాలు కుక్కకు గాక పంచామృతమునకు చెల్లని రీతిగ; పరమాత్ముని కృపగల శరణులకు (సత్పురుషులకు) కాక చేసెడి వ్యయము వ్యర్థము.

## 13

౩౭)   కళబేడ, కొలబేడ, హుసియ నుడియలు బేడ;
మునియు బేడ, అన్యరిగె అసహ్య బడబేడ;
తన్న బణ్ణిస బేడ, ఇదిర హళియలు బేడ,
ఇదే అంతరగ శుద్ధి, ఇదే బహిరంగ శుద్ధి,
ఇదే నమ్మ కూడల సంగమ దేవర నొలిసువపరి.

37)   దొంగలింపకు, హింసింపకు, అబద్ధమాడకు;
అలుగకు, అన్యులను అసహ్యించుకొనకు,
నిన్ను నీవు పొగడుకొనకు, పరులను తూలనాడకు,
ఇదే అంతరంగ శుద్ధి, ఇదే బహిరంగ శుద్ధి,
ఇదే మా కూడల సంగమ దేవుని మెప్పించు విధము.

ఇతరుల వస్తువులను అపహరించకుము, ఇతరుల మనస్సును నొప్పించకు, అబద్ధము లాడకుము, అలిగి కొపము చెందకుము, అన్యులను చూచి అసహ్యపడవద్దు. నిన్ను నీవు అమితముగా పొగడు కొనకుము, ఇతరులను ద్వేషింపకుము. ఇదే అంతరంగ శుద్ధి, ఇదే బహిరంగ శుద్ధి, ఇదే దేవుని మెప్పించు నిజమైన మార్గము.

## 14

౩౮)   దేవలోక మర్త్యలోక వెంబుదు బేరిల్ల కాణి భో!
సత్యవ నుడివుదె దేవలోక; మిథ్యవ నుడివుదె మర్త్యలోక.
ఆచారవెస్వర్గ; అనాచారవె నరక
కూడల సంగమదేవా, నీవె ప్రమాణు

38)   దేవలోకము మర్త్యలోకములనునవి వేరుగా లేవు తెలియుడో!
సత్యము పలుకుటే దేవలోకము; మిథ్యను ఫలుకుటే మర్త్యలోకము
ఆచారమే స్వర్గము; అనాచారమే నరకము
కూడల సంగమ దేవా, నీవే ప్రమాణము

దేవలోకము, మర్త్యలోకములనునవి వేరుగా లేవు; పైన, క్రింద ఎచ్చటా కాక అవి ఇచ్చటే గలవు. సత్యమును బలుకుటే దేవలోకము; అసత్యము పలుకుటే మర్త్యలోకము. ఆచారమే స్వర్గము. అనాచారమే నరకము. పరమాత్మా నీ ప్రమాణముగా నిది సత్యము.

## 15

३८) ಪುಣ್ಯಪಾಪವೆಂಬವು ತಮ್ಮ ಇಷ್ಟವು ಕಂಡಿರೆ;
‘ಅಯ್ಯಾ’ ಎಂದಡೆ ಸ್ವರ್ಗ ‘ಎಲವೋ’ ಎಂದಡೆ ನರಕ!
‘ದೇವಾ’ ಭಕ್ತ ಜಯಾ ಜೀಯಾ’ ಎಂಬನುಡಿ ಯೊಳಗೆ
ಕೈಲಾಸ ಮೈದುವುದೆ ಕೂಡಲ ಸಂಗಮದೇವಾ.

39) పుణ్యపాపములనునవి మీ యిచ్చ కంటిరా;
‘అయ్యా’ యనిన స్వర్గము; ‘ఓరీ’ యనిన నరకము.
‘దేవా, భక్తాదులారా శరణులారా’ యనెడి పలుకులందు
కైలాసముండును కూడల సంగమదేవా

పుణ్య పాపములనునవి తమ తమ చేతులందేగలవు. ‘అయ్యా’ అని పలికిన ఎల్లరతో మధుర బాంధవ్యము పెంపొందును. అచటే స్వర్గము నిర్మాణమగును. “ఓరీ” అని పలికిన విరోధము, జగడము ఉత్పన్నమై అచట నరకము నిర్మాణముగును. మాటలాడునపుడు ‘దేవా, భక్తులారా శరణులారా’ అనుచూ పలికిన ఎంతటి వారలలోనైనా మధుర బాంధవ్యము ఉత్పన్నమగును.

## 16

४०) ಎನಿಬಂದಿರಿ, ಹದುಳವಿದ್ದಿರೆ ಎಂದಡೆ
ನಿಮ್ಮ ಮೈಸಿರಿ ಹಾಱಿ ಹೋಹುದೆ?
‘ಕುಳ್ಳಿರೆ’ಂದಡೆ ನೆಲ ಕುಳಿ ಹೋಹುದೆ?
ಒಡನೆ ನುಡಿದಡೆ ಸಿರ ಹೊಟ್ಟೆ ಯೊಡೆವುದೆ?
ಕೂಡಲಿಲ್ಲ ದಿದ್ದಡೊಂದು ಗುಣವಿಲ್ಲ ದಿದ್ದಡೆ,
ಕೆಡಹಿ ಮೂಗ ಕೊಯ್ಯದೆ ಮಾಣ್ಬನೆ ಕೂಡಲ ಸಂಗಮದೇವರು.

40) ఎపుడు వచ్చితిరి, బాగున్నారా యనిన
మీ మేని సిరి తరిగి పోవునా?
కూర్చొనుడనిన నేల కృంగి పోవునా?
తక్షణమె పలుకరించిన తల బ్రద్దలై కడుపు పగులునా?
లేమిని గలిగి యుండినా ఈ గుణమైనా లేకున్న
పడద్రోచి ముక్కుకోయక మానునే కూడల సంగమదేవుడు

ఎపుడు వచ్చితిరి, క్షేమముగాయున్నారా? అని వచ్చిన వారలను పలుకరించిన మేను సిరి తరిగిపోవునే? వచ్చిన వారిని 'కూర్చోనుడు' అనిన నేల కృంగి పోవునే? వచ్చిన వారలను తక్షణమే పలుకరించిన తలబ్రద్దలై కడుపుపగులునా?వచ్చిన వారలకు ఏమైనా ఇచ్చెడి గుణము లేకున్ననూ, ప్రదర్శించటకైనా మంచి గుణము యుండగూడదా. మనఃపూర్వకముగా పలుకరించకున్ననూ మాట వరుసకైనా పలుకరించిన తరిగిపోవున దేమీలేదు. పైగా మెచ్చి కోలుపొందెదరు.

## 17

೪೧) ದಯ ವಿಲ್ಲದ ಧರ್ಮ ವದೇವುದಯ್ಯಾ
ದಯವೇ ಬೇಕು ಸಲಕ ಪ್ರಾಣಿಗಳೆಲ್ಲ ರಲ್ಲಿಯು.
ದಯವೇ ಧರ್ಮದ ಮೂಲವಯ್ಯಾ
ಕೂಡಲ ಸಂಗಯ್ಯ ನಂತಲ್ಲ ದೊಲ್ಲನಯ್ಯಾ.

41) దయలేని ధర్మమది యేదయ్యా
దయయే వలయు సలక ప్రాణులన్నింటి యందునూ
దయయే ధర్మపు మూలమయ్యా
కూడల సంగయ్య అటుల లేనిచో ఒల్లడయ్యా

'దయ'ను బోధించకుండా యుండు ధర్మమే యుండదు. ప్రతియొక ధర్మమునందు మూలతః దయాగుణము యుండును. మనుజులందే కాక సకల ప్రాణులన్నింటియందునూ దయగలిగి యుండవలెను. ధర్మపు మూలము దయయే. స్ఫూర్తి దయాగుణము లేకున్నచో అట్టి ధర్మవంతుని పరమాత్ముడు మెచ్చడు.

## 18

౪౧) తనగె మునివ వరిగె తామునియ లేకయ్యా?
    తన గాద ఆగేను? అవరిగాద చేగెయేను?
తనువిన కోపతన్న హిరి తనద కేడు!
    మనదకోప తన్న అఱివిన కేడు!
మన యొళగణ కిచ్చు మనెయ సుట్టల్లదె,
    నెరెమనెయ సుడువదె కూడల సంగమ దేవా!

42) తనపై కినియు వారలను తాకినియు టెందులకు
    తనకగు మేలేమి వారలకగు చేదేమి
తనువు కోపము తన పెద్దరికము చెరచు
    మనము కోపము తన వివేకమును చెరచు
ఇంటియందలి చిచ్చు ఇంటిని కాల్చుచూ
    పొరుగింటిని కాల్చు, కూడల సంగమదేవా

నీపై ఎవరైనా కోపము చెందిన మరల నీవు వారిపై కోపము చెందుటెందులకు? దాని వలన నీకు కలుగు లాభమేమిటి? వారికగునష్టమేమి? శరీరముమూలకముగా ప్రదర్శితముగు కోపము తన పెద్దరికమునకు చేటు తెచ్చును. మనస్సునందు కుదియు కోపము తనవివేక శక్తిని నశింప జేయును. ఇంటి యందు చిచ్చు రగిలిన అది మొదట తన ఇంటినే కాల్చును ఆ తదుపరియే పొరుగింటిని కాల్చును, ఇదే విధమున కోపము మొదట తనను నాశనము చేయును. ఆతదుపరియే ఎదుటి వారికి తాకును.

# 10 భక్తుని భక్తి స్థలము

## 1

౪౩) ఎనగింత కిఱియరిల్ల శివభక్తరిగింత హిరియరిల్ల;
నిమ్మ సాక్షి, ఎన్న మన సాక్షి!
కూడల సంగమదేవా; ఎనగిదే దిబ్య.

43) నాకన్న పిన్నలు లేరు, శివభక్తుల కన్నా పెద్దలు లేరు
నీ సాక్షిగ, నా మనస్సాక్షిగ
కూడళ సంగమదేవా, నా కిదే దివ్యము

మనుజులు తావెంతగా ఎదిగిననూ తాము పిన్నవారలమను భావము కలిగియుండవలెను. లోకమున శివభక్తుల కన్నా అధికులు లేరు. పరమాత్మా నీ పాద సాక్షిగ నామనస్సాక్షిగ నేనిటుల పిన్న వాడనను భావముగలిగి యుండుటే నాకు దివ్యము.

## 2

౪౪) చకోరంగె చంద్రన బెళగిన చింతె,
అంబుజకె భానువిన ఉదయద చింతె;
భ్రమరంగె పరిమళద బండుంబ చింతె
ఎనగె నమ్మ కూడల సంగమ దేవర నెనెవ చింతె.

44) చ కోరమునకు చంద్రుని వెన్నెల చింత
కమలమునకు సూర్యుడు ఉదయించు చింత
భ్రమరమునకు పరిమళము గ్రోలుటే చింత
నాకు మా సంగమదేవుని నెనియునదే చింత

చకోరపక్షి ఏలాగున చంద్రుని రాకను తలపోయునో, ఏలాగున కమల పుష్పము సూర్యుని ఆగమనమును కాంక్షించునో, భ్రమరము ఏలాగున పరిమళమును గ్రోలెడి చింతను కలిగియుండునో ఆలాగున పరమాత్ముని తలంపు నా సర్వాంగములందు వ్యాపించి యున్నది.

# 11 భక్తుని మహేశ్వర స్థలము

## 1

౪౫) కాగె ఒందగుళ కండడె కరెయదె తన్న బళగవను?
కోళి ఒందుకుటుక కండడె కూగి కరెయదె తన్న కులవనెల్లవ?
శివభక్తనాగి భక్తి పక్ష విల్లదిద్దడె కాగె కోళియింద కరకష్ట
    కూడల సంగమ దేవా!

45) కాకి ఒక మెతుకు గాంచిన పిలువదా తన బళగమును
కోడి ఒక గింజ గాంచిన కూచి పిలువదాతన కులమంతటిని
శివభక్తుడై యుండి భక్తి పక్షమున యుండడేని కాకి, కోడి
కన్నా కడునీచము, కూడల సంగమదేవా

కాకి అన్నపు మెతుకును చూచినంతనే కా, కా యని కూయచు తన బళగమును పిలచును. కోడి యొక గింజను గాంచి నంతనే క్కొక్కొయని పిలచి తనకుల బాంధవుల జతన పంచుకొని తినును. దేవుని భక్తుడగువాడు భక్త పక్షమును కట్టుకొని కూడియుండనిచో ఎలా? స్వార్థపరుడు కాకి, కోడి కన్ననూ కడునీచుడు కాడా.

## 2

౪౬) ఎల్లినోడిద డల్లి మన వెళసిదడె
    ఆణె, నిమ్మాణె, నిమ్మ ప్రమథరాణె!
పరవధువను మహాదేవియెంబె,
    కూడల సంగమదేవా.

46) చూచిన కడయెల్లా మన సీడ్చును
    ఆన, నీయాన, నీ ప్రమథుల ఆన
పరవ ధువును మహాదేవియనెద,
    కూడల సంగమదేవా.

పరమాత్మా దేనిని గాంచినా మనస్సు ఈడ్చును. అంతఃసాక్షియైన నా అంతరాత్మ ఆన, విశ్వము సాక్షియగు నీ ఆన, పారమార్థిక న్యాయాధీషులైన శరణుల ఆన, పరసతిని మహాదేవి యని, తల్లియని భావించి పవిత్ర దృష్టితో చూతును.

# 12. భక్తుని ప్రసాద స్థలము

**1**

೪೭) జన్మ జన్మక్కె హోగలీయదె, "సోహం" ఎందెనిసదె,
"దాసోహం" ఎందెనిసయ్యా
లింగ జంగమద ప్రసాదవతోఱి బదుకిసయ్యా
కూడల సంగమదేవా.

47) జన్మ జన్మల బడనటుల, సోహం బనియనిపించక
దాసోహంబనిపింపుమయ్యా
లింగ, జంగమపు ప్రసాదము చూపి బ్రతికించుమయ్యా
కూడల నంగమ దేవా

మరల మరల జన్మలనెత్తనటుల సోహం అని అనిపించకుండా దాసోహం అని అనిపించుమయ్యా. లింగప్రసాదము, జంగమపు ప్రపాదము ప్రసాదించి, నను బ్రతికింపుమయ్యా పరమాత్మా.

# 13. భక్తుని ప్రాణలింగి స్థలము

**1**

೪೮) తందెనీను తాయినీను; బంధునీను బళగనీను
నీ నల్లదె మత్తారు ఇల్లవయ్యా
కూడల సంగమదేవా,
హాలలద్దు, నీరలద్దు,

48) తండ్రివినీవు, తల్లివినీవు; బంధువునీవు, బళగము నీవు,
నీవు దప్ప నాకెవ్వరూ లేరయ్యా
కూడల సంగమదేవా
పాలముంచినా, నీటముంచినా నీవేగతి

ప్రాణలింగిస్థలమందున్న భక్తుడు (శరణుడు) సర్వమూ పరమాత్ముడే యను భావనను కలిగియుండును. తల్లి, తండ్రి, బంధువు, బళగము అంతా నీవే పరమాత్మా యనుచూ పాలముంచినా, నీటముంచినా నీదే భారము అని పరమాత్ముని శరణువేడుచుండును.

# 14 భక్తుని శరణస్థలము

## 1

೪೯) వచన దల్లి నిమ్మ నామామృత తుంబి,
నయన దల్లి నిమ్మ మూరుతి తుంబి,
కివియల్లి నిమ్మ కీరుతి తుంబి,
మనదల్లి నిమ్మ నెనహు తుంబి,
కూడల సంగమదేవా
నిమ్మ చరణ కమల దొళగానుతుంబి,

49) వచనమందు నీ నామామృతము నిండగ
కంటి యందునీ రూపు నిండగ
చెవియందు నీ కీర్తి నిండగ
మనమందునీ తలంపు నిండగ
కూడల సంగమదేవా
నీదు చరణ కమలమందు నేను నిండెద.

భక్తుని శరణస్థలము చేరుకొనవలెననిన పలికెడి పలుకులందు పరమాత్ముని నామామృతము నిండియుండవలె. కంటియందు అతడి రూపు, చెవియందు అతడి

కీర్తి, మనమందు అతడి తలంపు నిండి యుండవలె. ఈలాగున పరమాత్ముని చరణకమలమందు భక్తితో శరణాగతుడు కావలె.

**2**

೫೦) ఎనగెనిమ్మ నెనహాదాగలె ఉదయ;
ఎనగె నిమ్మ మఱహాదాగలె అస్తమాన
ఎనగె నిమ్మ నెన హవె జీవన
ఎనగె నిమ్మ నెనహవెప్రాణ కాణాతందే
స్వామి, ఎన్న హృదయదల్లి నిమ్మ చరణ దుండిగెయ నొత్తయ్యా
వదనదల్లి షడక్షరియ బరెయయ్యా కూడల సంగమదేవా.

50) **నాకు నీ జ్ఞాపకం కలుగటే ఉదయము**
**నాకు నీ మరపు కలుగుటే అస్తమానము**
**నాకు నీ జ్ఞాపకమే జీవనము**
**నాకు నీ జ్ఞాపకమే ప్రాణము చూడుమా తండ్రీ,**
**స్వామీ, నా హృదయమందు నీ పాద ముద్రను వత్తయ్యా**
**వదనమునందు షడక్షరిని వ్రాయుమయ్యా**
**కూడల సంగమదేవా**

పరమాత్మానాకు నీ తలంపు గలిగినంతనే, ప్రొద్దుపొడచును. నినుమరిచిన తోడనే ప్రొద్దుగ్రుంకును. నిన్నుతలచుటే బ్రతుకు నాకు. నిను తలచుటే ప్రాణమునాకు. నా హృదయ మందు నీ పాదారవిందముల నుంచుమయ్యా నా వదనమందు షడక్షరిని లిఖించుమయ్యా.

**3**

51 ఎన్న కాయవ దండిగెయ మాడయ్యా
ఎన్న శిరవ నొరెయ మాడయ్యా
ఎన్న నరవ తంతియ మాడయ్యా
ఎన్న బెరళ కడ్డియ మాడయ్యా

బత్తీస రాగవ హాడయ్యా, ఉదరలొత్తి బారిసు.
కూడల సంగమదేవా.

51) నాకాయమును దండిని చేయుమయ్యా
నా శిరమును కాయను చేయుమయ్యా
నా నరమును తంతిని చేయుమయ్యా
నా వ్రేలును కడ్డీని చేయుమయ్యా
బత్రీస రాగములు పాడుమయ్యా, ఎదనొత్తి మ్రోయించు
కూడల సంగమదేవా

నన్నొక వీణగా జేసి దేవా దానిని పలికించుము. నా కాయము తుంబుర దండముగాను, నా శిరము కాయగాను, నా నరములు తంత్రులు గాను కాగా నావ్రేళ్లు దానిని మీటు కడ్డీలయి ముప్పది రెండు రాగములను ఇటనుండియే మ్రోగింతును.

# 15 భక్తుని ఐక్య స్థలము

1

గ.౨) అభ్యాస వెన్న వత్తిఁసిత్తయ్యా, భక్తి సాధ్యవాగదు,
నానే వెనయ్యా?
నానిమ్మ మనం బోగువన్నక్క నీ వెన్న మనం బోగువన్నక్క
కాయగుణం గల కళెదవరిగె శరణెంబె,
కూడల సంగమదేవా

52) అభ్యాసమున కలవడెనయ్యా, భక్తి సాధ్యముకాదు
నేనేమి చేతునయ్యా
నేను నీ మదికి వచ్చునందాక నీవు నా మదికి వచ్చునందాక
కాయగుణములుడిగిన వానికి శరణందును,
కూడల సంగమదేవా

నిను తలచునట్టి అభ్యాసము నా కలవడినది, కాని భక్తి సాధ్యమగుట లేదు. నేనేమి చేతును, పరమాత్మా! నేను నీ జ్ఞాపకమునకు వచ్చు వరకు, నీవు "నా జ్ఞప్తికి వచ్చు నందాక. దేహము గుణములు ఉడిగిన వానికి శరణందును పరమాత్మా.

**2**

೫೩) సంచల విల్లద భక్తి వంచనెయిల్లద మంహాంతరతోరో
తను శుచి మనశుచిగళ తోరో
ఇంతప్ప శివలింగైక్యర తోరి బదుకిసు.
కూడల సంగమదేవా

53) **సంచలనము లేని భక్తి, వంచనలేని మహాత్ముల చూపుమో**
**తను శుచి మనశుచి గలవారిని చూపుమో**
**ఇంతటి శివలింగైక్యుల చూపి బ్రతికింపుము**
**కూడల సంగమదేవా**

చపలతలేని భక్తి, వంచనగుణములేని మహాత్ములను చూపుము. తనువు శుచి, మనము శుచి గలవారలను చూపుము. పరమాత్మా ఇటువంటి గుణములు గల శివునితో ఐక్యమగు శక్తి సంపన్నులను చూపి నన్ను బ్రోవుము.

# ೨ మహేశ్వర స్థలము

**1**

೪) ఎత్తెత్త నోడిద డత్తత్త నీనెదేవా,
సకల విస్తారద రూహు నీనె దేవా,
'విశ్వతస్ చక్షు' నీనె దేవా,
'విశ్వతోముఖ' నీనె దేవా,
'విశ్వతో బాహు' నీనె దేవా
'విశ్వతః పాద నీనె, దేవా కూడల సంగమదేవా.

54) ఎందెందు జూచిన అందందు నీవేదేవా
సకల విస్తారమగు రూపము నీవేదేవా
విశ్వతశ్చక్షువు నీవేదేవా
విశ్వతో ముఖుడవు నీవేదేవా
విశ్వతో బాహు నీవేదేవా
విశ్వతో పాదుడవు నీవేదేవా కూడల సంగమదేవా.

ఎందెందు జూచిన అందందు నీవేగలవు. ఈ విస్తారమైన సృష్టి యంతా నీ అంశమే. విశ్వమంతటా చూచువాడవు నీవే. విశ్వమందంతటా నీ ముఖమే. విశ్వము నిండానీ బాహువులు. విశ్వమందంతటా నీ పాదములు ఇలాగున దేవా నీవు సర్వకర్తవై, సర్వముఖుడవై, సర్వశక్తుడవై, సర్వవ్యాపివై యున్నాడవు.

**2**

౫౫) ఇబ్బరు మూవరు దేవరెందు ఉబ్బి మాత నాడ బేడ
ఒబ్బనె కాణిరొ, ఇబ్బరెంబుదు హుసినోడా!
కూడల సంగమ నల్లదె ఇల్లవెందిత్తువేద.

55) ఇద్దరు ముగ్గురు దేవుళ్ళని ఉబ్బి మాటాడకు
ఒక్కడే చూడుడో ఇద్దరనునది అబద్ధము గనుమా
కూడల సంగమదేవుడు కాక వేరేదేవుడు లేడనును వేదము

ఇరువురు ముప్వురు దేవుళ్ళు గలరని ఉబ్బిపోయి మాటాడకుము. అనగా హరి హరులిద్దరు దేవుళ్ళు. బ్రహ్మ -విష్ణు -మహేశ్వరుడు ముగ్గురు దేవుళ్ళు ఈ రీతిగా సమన్వయతను సాధించుదునని ఉబ్బిఉబ్బి మాటాడకుము. ఉండునది ఒక్కడే దేవుడు. ఇద్దరను మాటసరికాదు. వేదము గూడ పరమాత్ముడొక్కడే దేవుడను చున్నది.

## 3

౫౬) అరగుతిందు కరగువ దైవన
ఉరియకండడె మురుటువ దైవవ నెంతు సరియెంబెనయ్యా?
అవసర బందడె మారువ దైవన నెంతు సరియెంబెనయ్యా?
అంజికి యాదడె హోళువ దైవవ నెంతు సరియెంబెనయ్యా?
సహజ భావ నిజైక్య కూడల సంగమదేవ

**56) నిప్పు తాకిన కరిగిపోవు లక్కదేవుడు**
**మంటతాకిన మాడిపోవు చెట్టుదేవుడు**
**అవసరమొచ్చిన అమ్మెడి లోహదేవుళ్ళు**
**భయము గొలువుతు జూచెడి భూమిలో దిగుబడే దేవుడు**
**దేవుళ్ళెటులగుదురయ్యా**
**సహజ భావ నిజైక్యుడు కూడల సంగమ దేవుడు**

ఇదేమి విచిత్రము! లక్కతో తయారుచేసిన దేవుడు నిప్పుతాకినంతనే కరిగిపోవును. కట్టెతో తయారు చేసిన దేవుడు మంటతాకినంతనేకాలిపోవును. వెండి, బంగారము, పంచలోహములతో తయారు చేసిన దేవుళ్ళను అమ్మిన కొనెదరు. భయము గొలుపుతూ చూచెడి రూపుతో చెక్కిన రాతి దేవుళ్ళు భూమి కృంగినవేళ భూమిలో దిగబడి పోదురు. అట్టి వీరెల్లరూ దేవుళ్ళెలా అగుదురు. సహజ భావ నిజైక్యుడగు పరమాత్ముడొక్కడే దేవుడు.

## 4

[illegible]) నీరకండల్లి ముళుగువరయ్యా,
మరన కండల్లి సుత్తువరయ్యా!
బత్తువ జలవ ఒణగువ మరన
మచ్చిదవరు నిమ్మనెత్తబల్లరు,
కూడల సంగమదేవా?

**57) నీరు గాంచిన మునిగెదరయ్యా**
**చెట్టు గాంచిన చుట్టెదరయ్యా**

ఇంకెడి నీరు ఎండెడి చెట్టు
మెచ్చువారు నిన్ను తెలియలేరు
కూడల సంగమ దేవా

నది నీటిని, కోనేరు నీటి లందుమునిగి స్నానమాచరింతురు, పాపములు పోవునని. చెట్టుచుట్టూ తిరిగెదరు దోషముతొలగునని. ఇంకెడి నీరు ఎండెడి గుణము గల చెట్టులను నమ్మువారు నిన్ను తెలియలేరు పరమాత్మా.

**5**

೫೮) హొలె గండల్లద పిండద నెలెగాశ్రయ విల్ల,
జల-బిందువిన వ్యవహార ఒందే
ఆసె యామిష రోష హరుష విషయాదిగళెల్లా ఒందె.
ఏననోది, ఏనకేళి, ఏనుఫల?
కులజనెంబుదక్కె అవుదు దృష్ట?
"సప్త ధాతు సమం పిండం సమయోని సముద్భవం
ఆత్మ జీవ సమాయుక్తం వర్ణానాం కిం ప్రయోజనం" ఎందుదాగి,
కాసి కమ్మారి నాద, బీసి మడివాళనాద;
హాసనిక్కి సాలిగనాద; వేదవనోది హారువనాద
కర్ణదల్లి జనిసిదవరుంటె జగదొళగె?
ఇదుకారణ కూడల సంగమదేవా,
లింగస్థలవ నఱిదవనె కులజను!

58) మైలగొకయె పిండమున కాశ్రయము లేదు
జలబిందువుల వ్యవహార మొక్కటే
ఆశ, అభిలాష, రోష, హర్ష విషయాదులన్నియూ యొక్కటే
ఏమి చదివినా, ఏమి వినినా, ఏమిఫలము
కులజుడనుటకు ప్రమాణమేది?
"సప్తధాతు సమంపిండం సమయోని సముద్భవం

ఆత్మ జీవ సమాయుక్తం వర్ణానాం కిం ప్రయోజనం"
కాచి కమ్మరి ఆయె, ఉతికి చాకలి ఆయె
నేతనేసి సాలెవాడయ్యె, వేదము చదివి బ్రాహ్మడయ్యె.
చెవినుండి పుట్టినవారు గలరాభువిపై
ఈ కారణముగ కూడల సంగమదేవా
లింగస్థలమెరిగిన వాడే కులజుడు

పుష్పవతిగానిదే పిండమున కాశ్రయము లేదు. సమస్త జీవులు పుట్టునది మైల నిలచినపుడే. అందరి యందునూ జలబిందువుల వ్యవహారము యొకే విధమున యుండును. ఆశ, అభిలాశ, రోష హర్ష మున్నగు మానసిక విషయదులన్నియూ యొక్కటే. శాస్త్రము లెన్ని చదివినా, ఎన్నివినినా ఏమి ప్రయోజనము? ఒకవ్యక్తి శ్రేష్ఠకులజుడనుటకు ఏమి ప్రమాణము గలదు? ఎల్లరి దేహములు సప్తధాతువుల నుండి పుట్టినవే? ఎల్లరూ పుట్టునది యొకేరీతిననే. ఆత్మ జీవుల సమాగమము ఎల్లరి యందుగలదు.
కాచువాడు కమ్మరి అనబడెను. బట్టలు ఉతుకు వాడు చాకలి అనబడెను. నేతకాడు సాలెవాడాయెను. వేదము చదివి బ్రహ్మ జ్ఞానము బడసినవాడు బ్రహ్మణుడన బడెను. ఎవరైనా చెవినుండి పుట్టెడి వారు గలరా భువిపై పరమాత్మా నిన్ను తెలిసికొనిన వాడే ఉత్తమ కులజుడు.

## 6

ಗೆ) ಕೊಲುವನೆ ಮಾದಿಗ ಹೊಲಸು ತಿಂಬುವನೆ ಹೊಲೆಯ
ಕುಲವೇನೊ ಅವಂದಿರ ಕುಲವೇನೊ?
ಸಕಲ ಜೀವಾತ್ಮರಿಗಿ ಲೇಸನೆ ಬಯ ಸುವ
ನಮ್ಮ ಕೂಡಲ ಸಂಗನ ಶರಣರೆ ಕುಲಜರು!

హింసించువాడె మాదిగ, పొలుసుతిను వాడె మాల
కులమేదో వారికులమేదో?
సకల జీవాత్మలకు మంచిని పంచెడి
మా కూడల సంగని శరణులే కులజులు

శరీరరము, మాట, మనములనుండి అన్యులను హింసించువాడే మాదిగ, నీతి -ధర్మములను విడిచి సరిపడని వాటిని తినువాడే మాల్మ, కులము, కులమని బూటకపు మాటలాడు-జనులారా? సకల జీవాత్మలకు మేలొనరించునట్టి స్వభావముగల వారే ఉత్తమ కులజులు. వారే శరణులు.

## 7

౬౦) గరూపదేశ మంత్రవైద్య; జంగమోపదేశ శస్త్రవైద్యనోడా
భవరోగవ కళెవ పరియనోడా
కూడల సంగన శరణర అనుభావ
మడివాళన కాయక దంతె!

60) గురూపదేశము మంత్ర వైద్యము
జంగమోపదేశము శస్త్రవైద్యము గనుమా
భవరోగమును తొలగించెడి విధము గనుమా
కుడల సంగని శరణుల అనుభావము
మడివాళుని కాయకమువలెయుండు

ధర్మానుమాయికి ఇద్దరి సంబంధము పొసగును. వారే గురువు, జంగముడు. గురువు ప్రత్యక్ష సంపర్కమునందుండి అనుయాయుల ధార్మిక అవసరములను చూచెడివాడు. జంగముడు ధర్మ బోధకుడై వచ్చెడి నిరాభారి. జ్ఞాననిధియైన అతడు హెచ్చు ఆధ్యాత్మిక జ్ఞానమును ఇచ్చును. గురువు వైద్యుడంతే. జంగముడు శస్త్ర చికిత్స చేసెడివాడు. మడివాళుడు అనగా చాకలి భౌతికమైన జలమునందు స్థూల వస్త్రములను ఉతికి ఇచ్చునటుల జంగముడు జ్ఞాన జలము నందు హృన్మన బుద్ధియనెడి బట్టలను ఉతికి ఇచ్చును.

## 8

౬౧) ఛల బేకు శరణంగె పరధనవ వొల్లెనెంబ
ఛల బేకు శరణంగె పరసతియ నొల్లెనెంబ
ఛల బేకు శరణంగె పరదైవవ నొల్లెనెంబ

ఛల బేకు శరణంగె లింగ జంగమ ఒందె ఎంబ
ఛల బేకు శరణంగె ప్రసాద దిట వెంబ
ఛల విల్ల దవర మెచ్చ కూడల సంగమ దేవ.

61) నియమముండవలె శరణునకు పరధనము కోరని
నియమముండవలె శరణునకు పరసతిని కోరని
నియమముండవలె శరణునకు పరదైవమును కోరని
నియమముండవలె శరణునకు లింగ జంగమ మొకటెయని
నియమముండవలె శరణునకు ప్రసాదము నిజమనెడి
నియమములేని వారల మెచ్చడు కూడల సంగమ దేవుడు 61

శరణుడైన వానికి కొన్ని నియమములు అర్థాత్ స్వాభిమానము యుండవలెను. పరధనమును, పరసతిని, పరదైవమును కోరని పట్టుదలయుండవలెను. లింగ జంగములు ఒకే నాణ్యపు రెండు ముఖములని తెలియవలెను. పరమాత్ముని కినివేదించినది ప్రసాద మనెడి సత్యమును తెలిసి నమ్మకము గలవాడై యుండవలెను. ఇట్టి నియమములు లేని వారిని పరమాత్ముడు మెచ్చడు.

9

౬౧) సుఖ బందడె పుణ్యద ఫలవెన్నెను
దుఃఖ బందడె పాపద ఫలవెన్నెను
నీమాడిద డాయిత్తెందెన్నెను
కర్మక్కెకర్తృవెకడె యెందెన్నెను.
ఉదాసీన విడిదు శరణెన్నెను
కూడల సంగమదేవా, నీ మాడిదు పదేశవు ఎనగీ పరియల్లి
సంసారవ సవెయె బళుసువెను

62) సుఖము వచ్చిన పుణ్యాపు ఫలమందును
దుఃఖము వచ్చిన పాపపు ఫలమందును
నీవు చేసిన అయినదని అనను

కర్మకు కర్తయే తుదియని అనను
ఉదాసీనముతో శరణనలేను
కూడల సంగమదేవా, నీవు జేసినయుపదేశము నాకివ్విధమే
సంసారపు సారమునే ఉపయోగించెద

సుఖము నుండి నేను హర్షభరితముగ ఉన్నాను అని అనుకొనినపుడు అది నా పూర్వపు ఫలమని యనుకొనెద. దుఃఖము వచ్చినపుడు అది నా వెనకటి పాపపు ఫల మనుకొనెద. నీవు చేసినందున అయినదని అనను. నా కర్మలకు నేనే కారణము అనుకొనెదనే గాని నీ గురించిన ఉదాసీనతను సహించలేను పరమాత్ముని నుండి నాకు దొరికిన ఉపదేశమేమనగా నా ఐహిక జీవనము యొక్క కష్టసుఖములను మరచి లోకపు హితమున్నకై శ్రమించుచు నేను బ్రతికెదను.

## 10

೬೩) అణ్ణ, తమ్మ, హెత్తప్ప, గోత్ర వాదడేను
లింగ సాహిత్య విల్ల దవర ఎన్నవరెన్నెనయ్యా
నంటుభక్తి నాయక నరక,
కూడల సంగమదేవా!

63) అన్న, తమ్ముడు, మాయప్ప సగోత్రుడైన నేమి
లింగ సాహిత్యము లేనివారల నావారని యననయ్యా
బంధుప్రీతి పరమ నరకము
కూడల సంగమదేవా

అన్న, తమ్ముడు, తండ్రి సగోత్రులై ఒకే ఇంటివారైనా నేమి పరమాత్ముని తెలిసికొనెడి సాహిత్యమును చదివి శరణ మార్గావ లంబులు కారేని నావారలని భావించను. పరమాత్ముని పూజింపని, ఆతడుపదేశించిన మార్గమున నడువని బంధువుపై ప్రీతి గలిగియుండుట నరకమునే తెచ్చును కాదే పరమాత్మా.

11

౬౪) జగదగల ముగిలగల మిగియగల నిమ్మగల
పాతాళ దిందత్తత్త నిమ్మ శ్రీ చరణ.
బ్రహ్మాండ దిందత్తత్త నిమ్మ శ్రీముకుట
అ ప్రమాణ అగమ్య అగొచర అప్రతిమ లింగవె
కూడల సంగమ దేవయ్యా,
ఎన్న కరస్థలక్కె బందు చుళుకాది రయ్యా!

64) భువికన్నా, దివికన్నా, విశాలమైన బ్రహ్మాండము కన్నా
పాతళముచెంతన నీ శ్రీచరణములు
బ్రహ్మాండముచెంతన నీ శ్రీముకుటము
అ ప్రమాణ మగమ్య మగోచర అప్రతిమ లింగమా
కూడల సంగమదేవయ్యా
నీవు నా కరస్థలికి వచ్చి చులుకైతి వయ్యా

పరమాత్మా భువికన్నా, దివికన్నా, ఇంకా విశాలమైన బ్రహ్మాండము నందంతటా వ్యాపించియున్నావు. పాతాళము కన్నా అతీతమైన చోట నీ శ్రీచరణములు. బ్రహ్మాండమునకు ఆవలనీశ్రీముకుటము. గమనము లేని వాడా, ఇంద్రియములకు నీవు అగోచరుడవు. ఉపమాతీతుడవైన లింగమా పరమాత్మా నీవు నా అరచేతికి ఇష్టలింగమను చిరురూపివై చిక్కితివయ్యా.

# 3. ప్రసాద స్థలము

1

౬౫) హసి వాయెత్తెందు అర్పితవ మాడువరయ్యా
తృషె యాయిత్తెందు మజ్జనక్కెరి వరయ్యా
హసివు, తృషె విషయక్కె బళలువరయ్యా!
హసి వాయిత్తెందు అర్పితవ మాడలిల్ల
తృషె యాయిత్తెందు మజ్జ నక్కెరి యలిల్ల

ఇదు కారణ కూడల సంగమదేవర పూజిసి
ప్రసాదవ హడెవ రొబ్బరూ ఇల్ల!

65) ఆకలాయెననుచు అర్పితము చేసెదరయ్యా
దప్పి అయెననుచు స్నానము చేసెదరయ్యా
ఆకలి, దప్పుల విషయములకు లొంగెదరయ్యా
ఆకలి అయె ననుచు అర్పితము చేయక
దప్పి ఆయెననుచు త్రాగక
కూడల సంగమ దేవుని పూజించి ప్రసాదము
బడయువాడొక్కడూ లేడు 65

దేవుని పూజించు సమయమున ఆకలి దప్పులుడగవలెను. ఈ ఆకలి దప్పులకు లొంగెదరు జనులు. ఆకలి ఆయెననుచు పూజించనిదే తినెదరు. దప్పి అయినదని లింగమునకు మజ్జనము చేయకయే త్రాగుదురు. అలా చేయక కరుణోదకము, పరమాత్ముని పూజించియే, ప్రసాదములు బడయవలెను.

## 2

౬౬) పండిత నాగలి, మూర్ఖనాగలి, సంచిత కర్మ ఉండల్లదె బిడదు? ప్రారబ్ధ కర్మ భోగిసి దల్లదె హోగదెందు శ్రుతిసారుత్తైదావె, నోడా
తానావలోక దొళగిద్దడెయూ బిడదు.
కర్మ ఫల గూడి కూడల సంగమదేవంగె
ఆత్మనైవేద్యవ మాడిదవనె ధన్య

66) పండితుడైనా పామరుడైనా సంచితకర్మ పొందక తప్పదు
ప్రారబ్ధ కర్మమనుభవించక తప్పదని శ్రుతులు తెలుపుచున్నవి గనుమా
ఏ లోకమందున్ననూ విడువదు
కర్మఫలము కుడిచి కూడల సంగమదేవునికి
ఆత్మనైవేద్యము చేయువాడే ధన్యుడు.

కర్మలు మూడు విధములు సంచిత, ప్రారబ్ధ, ఆగామి అనునవి. ఈ కర్మలను ఎంతటివారలైన అనుభవివంపక తప్పదు. మనిషి ఎచ్చటయున్ననూ విడువవు. కర్మఫలము ననుభవించుచూ పరమాత్మునికి ఆత్మార్పణము చేయువాడు ధన్యుడు.

**3**

౬౭) ఒల్లె నెంబుదు వైరాగ్య ఒలివెనెంబుదు కాయగుణ
ఆవ పదార్థ వాదడేను.? తానిద్దెడెగె బందుద
లింగార్పితవ మాడి భోగిసువుదే ఆచార
కూడల సంగమదేవర నొలిస బంద
ప్రసాద కాయవ కెడిసలాగదు

67) **వలదనునది వైరాగ్యము వలయుననునది దేహపు గుణము**
**ఏ పదార్థమైననేమి? తానున్న చోటుకు వచ్చినది**
**లింగార్పితముచేసి భోగించుటే ఆచారము.**
**కూడల సంగమదేవుడు మెచ్చగ వచ్చిన**
**ప్రసాద కాయము. చెఱుపరాదు.**

ఏదీ వలదనుట వైరాగ్యస్వభావము. వలయుననుట దేహము స్వభావము. తానున్న చోట లభించు ఏ పదార్థమునైనా పరమాత్మునికి నివేదనము గావించి భుజించుట ఆచారము. పరమాత్ముని కృపతోడైన ప్రసాదరూపమగు దానినే భుజింప వలెను. అప్పుడే దేహము ప్రసాద కాయమగును.

**4**

౬౮) ఒప్పవ నుడివిరయ్యా తప్పవ తొడెదంతె
శరణ తన్న మెఱివనె బిన్నాణె యంతె?
కూడల సంగన ప్రసాదదింద బదుకువ నల్లదె
తన్న మరెవనె?

68) **నెమ్మదిగా బలుకుడయ్యా నేయి నాకినటుల**

శరణుడు తానై బయట పడడు జాణవలె
కూడల సంగని ప్రసాదమున బ్రతుకునే గాని
తనను తెలుపుకొనడు?

నేయినాకు నటులుగా నెమ్మదిగా పలుకవలెను. అటుల మాటాడు వారలు శరణులు. అట్టి వారు తమగూర్చి మెరియంపు కొనరు. పరమాత్ముని ప్రసాదమును మాత్రమే గానెడి లాంఛనము గల ప్రసాది తన్నుతా మరచును.

**5**

౬౮) మౌనద లుంబుదు ఆచారవల్ల
లింగార్పితవ మాడిద బళిక,
తుత్తి గొమ్మె శివ శరణెనుత్తిర బేకు
శరణ వృత్తిగళ డగువవు
కూడల సంగన నెనెవుత్తలుండడె.

69) మౌనముగా భుజించునది ఆచారము కాదు
లింగార్పితము గావించిన పిదప
బుక్క బుక్కకు శివ శరణనుచుండవలె
అంతః కరణ ప్రవృత్తులడగును
కూడల సంగని తలచుచూ భుజించిన

మౌనముగా భుజించుట ఆచారము కాదు. కంచమున వడ్డన పిదప లింగార్పితము (పరమాత్మునికినివేదనము) చేసిన తదుపరియూ ప్రతియొక్క బుక్కకు 'శివ' శరణనుచు భుజించవలెను. ఈ విధముగా మంత్ర ధ్యానము చేయుచూ భుజించుట వలన ఇంద్రియ వృత్తులు అడగును.

**6**

౭౦) గురులింగ జంగమ దింద పాదోదకప్రసాద వాయిత్తు.
ఆభావవే మహాను భావ వాగి,

ఎనగె మత్తె బేఱు ప్రసాద వెంబుదిల్ల
కూడల సంగమదేవా

70) **గురులింగ జంగమముచే పాదోదకము ప్రసాదమాయె**
**ఆభావమే మహాను భావమై**
**నాకు మరల వేరు ప్రసాదమనునది లేదు**
**కూడల సంగమ దేవా**

గురువనగా ధర్మ గురువు, లింగమనగా పరమాత్ముడు, జంగముడనగా అనుభావముగల శరణుడు (సంఘమునందు జంగములని పిలువ బడువారు కారు. వారు జాతి జంగములుగా మిగిలి యున్నారు.) వీరలచే పాదోదకము. ప్రసాదము బడయు వలెనను భావము మహాను భావమై యుండు పరమాత్మా ఆ స్థితిగల నాకు వేరు ప్రసాదము అనునదే లేదు.

## 7

౭౧) దాసోహవెంబ సోహెగొండు హోగి
గురువకండె, లింగవకండె, జంగమవకండె, ప్రసాదవ కండె
ఇంతీ చతుర్విధ సంపన్న నాదె కాణా,
కూడల సంగమదేవా

71) **దాసోహమను సోహమును బట్టి పోయి**
**గురువును గంటి, లింగమును గంటి, జంగముని గంటి, ప్రసాదమును గంటి**
**ఇటులీ చతుర్విధ సంపన్నుడనైతిని, గనుమా**
**కూడల సంగమదేవా.**

దాసోహమనగా ఇచ్చుట. అన్నదాసోహము, ధనదాసోహముతోటి జనులకు చేయవలెను. తను మనదాసోహమును పరమాత్మునికి చేయవలెను. ఇట్టి విధానమాచరించుచూ పోయినిజగురువును అరసితిని, పరమాత్ముని తెలిసితిని, జంగముని దర్శనము బడసితిని, ప్రసాద మహిమను గంటిని. ఈ విధమున పరమాత్మా నేను చతుర్విధ సంపన్నుడనైతిని.

## 8

೭೨) సజ్జన శరణరకండు ఎన్నమన ఉబ్బిత్తు, నోడిరయ్యా!
శ్రీ గురుపాదవ హిడిదు పావన నాదెనయ్యా!
పాదోదక ప్రసాద దింద భవగెట్టెను,
కూడల సంగమ దేవా

72) సజ్జన శరణుల చూడ నామది ఉబ్బును చూడురయ్యా
శ్రీ గురు పాదము బట్టి పావనుడనైతినయ్యా
పాదోదక ప్రసాదమునుండి భవము తొలగించుకొంటిని
కూడల సంగమదేవా

సత్పురుషులగు శరణులను గాంచినంతనే నా మది పొంగిపోవును. శ్రీ గురువు పాదమునుబట్టి పవిత్రుడనైతిని. పరమాత్మా పాదోదక ప్రసాదములనుండి నా పాపములను తొలగించుకొంటిని.

## 9

೭೩) కాయద కరణద కైయలు పదార్థవ హిడివల్లి
నిమగె కొడువ భరద భీతియింద నఱియదిప్పనాగి
ఎన్న నీనరిదు సలహుత్తిప్పయయ్యా,
కూడల సంగమదేవా

73) దేహేంద్రియ కరమున పదార్థము పట్టినపుడు
నీకు సమర్పించు విధమును భీతిచే నెరుగనందున
నన్ను తెలిసి నీవు సాకుచుంటివి కదయ్యా
కూడల సంగమదేవా

అంతః కరణము నందు భ్రాంతితో కరమున పదార్థము పట్టినప్పుడు నీకు సమర్పించుటను నేను మరచినా అట్టి నా స్థితిని తెలసిన నీవు ఆ ప్రసాదముగొని నన్ను రక్షించుచుంటివి కదయ్యా పరమాత్మా.

౭౪) త్రివిధ ప్రసాద వెందెంబరు అదెం తహదో?
శుద్ధ ప్రసాద గురువి నదదు, సిద్ధ ప్రసాద లింగదదు
ప్రసిద్ధ ప్రసాద జంగమదదు
ఇంతీ త్రివిధ ఒందాదవర తోరో
కూడల సంగమదేవా

74) త్రివిధ ప్రసాద మందురు అదెంతటిదో
శుద్ధ ప్రసాదం గురువు సంబంధి, సిద్ధ ప్రసాదము లింగ సంబంధి
ప్రసిద్ధ ప్రసాదము జంగమ సంబంధి
ఇటులీ త్రివిధములొకటైన చూపుమో
కూడల సంగమదేవా

ప్రసాదము త్రివిధములనెదరు. అదెలాగనేని శుద్ధమైన ప్రసాదము గురు సంబంధము, సిద్ధ ప్రసాదము లింగ సంబంధము, ప్రసిద్ధ ప్రసాదము జంగమ సంబంధము. ఈ విధమున త్రివిధ ప్రసాదము లొకటైన వారిని చూపించుము పరమాత్మా

## 11

౭౫) ఉరితాగిద మృగవు ఒందడియ నిడువుదె?
తనువ తాగిద సుఖవు అగలువుదె?
కూడల సంగన శరణర అనుభావ వరిదవర
మరళి మర్త్య రెందెన బహుదె?

75) వలకు చిక్కిన మృగము ఒక అడుగు వేయునా
తనువు దాకిన సుఖము విడువడునా
కూడల సంగని శరణుల అనుభాము తెలిసినవారు
మరల మర్త్యమునకు కొచ్చు వారనవచ్చునే?

వలలో చిక్కిన మృగము ఒక్కడుగైనా ముందుకు వేయలేదు. సుఖమున కలవాటయిన దేహము ఆ సుఖములను వదలుకొనునా? పరమాత్ముని తెలిసిన శరణుల అనుభావమును ఎరింగిన వారు మరల జన్మింతురా. వారికి మరు జన్మయుండదు.

# ప్రాణలింగి స్థలము

## 1

೭೬) కబ్బున పరుశవేది యాదడేను
కబ్బున హొన్నాగదడా పరుషవదేకో?
మనెయొళగణ కత్తలె హరియదడాజ్యోతియదేకో?
కూడల సంగమదేవర మనముట్టి పూజిసి
కర్మహరియదడా పూజెయదేకో?

76) ఇనుము పరుశవేది ఐననేమి
ఇనుము బంగారము కానిచో ఆపరుశవేది ఎందులకు
ఇంటియందలి చీకటిని బాపని ఆ జ్యోతి ఎందులకు
కూడల సంగమ దేవుని మనసార పూజించు
కర్మను తొలగించనిచో ఆ పూజ ఎందులకు

పరుశవేది ఇనుమును బంగారముగా మార్చు శక్తిని కలిగియుండును. అట్టి శక్తి లేనట్టి పరుశవేది వృథాయే. ఇంటిలో గల చీకటిని తొలగించు శక్తి లేని జ్యోతి యుండియూ నిష్ప్రయోజనమే. కూడల సంగమదేవుడనెడి పరమాత్మను మనసార పూజించినచో కర్మలనది తొలగించును.

## 2

೭೭) నుడిదడె ముత్తిన హారదంతిర బేకు
నుడిదడె మాణిక్యద దీప్తి యంతిర బేకు.
నుడిదడె స్ఫటికద సలాకె యంతిర బేకు
నుడిదడె లింగమెచ్చి అహుదహుదెన బేకు
నుడియొళగాగి నడెయదిద్దడె
కూడల సంగమదేవ నెంతొలివనయ్యా?

77) పలికిన ముత్యపు హారగాయుండవలె
పలికిన మాణిక్యపు దీప్తిగా యుండవలె
పలికిన స్ఫటికపు సలాకవలె యుండవలె
పలికిన లింగము మెచ్చి ఔనౌననవలె
పలికినటులుగా నడవకున్నచో
కూడల సంగమదేవుడెటుల మెచ్చునయ్యా

శరణుడగువాడు మాటలాడిన ముత్యపు హారగా చక్కగా అనిపించవలెను. అతడి మాటలు మాణిక్యపు కాంతియై వెలుగొందవలెను. అతడి పలుకులు స్ఫటికమును బోలియుండవలెను. పరమాత్ముడు మెచ్చులాగుండవలెను. నుడివినటులుగా నడువని వారలను పరమాత్ముడు మెచ్చడు.

### 3

೭೮) ಸ್ಥಾವರ ಜಂಗಮ ವೆಂಬ ಉಭಯ ಪಕ್ಷ ಒಂದೆ
ಅವಮುಖದಲ್ಲಿ ಬಂದಡೂ ತೃಪ್ತಿಯೊಂದೆ
ಕೂಡಲ ಸಂಗಮದೇವರ ಆಪ್ಯಾಯನ ಒಂದೆ

78) స్థావర, జంగమమను రెండూ యొకటే
ఏ ముఖమున వచ్చినా తృప్తి యొకటే
కూడల సంగమదేవని ఆప్యాయత యొకటే

ఒకేచోటున యుండిన స్థావరమనబడును. స్థాపిత లింగము యొకేచోటున యుండును. జంగముడగువాడు చరిస్తూ యుండును. ఈ రెంటికీ భేదము లేదు. ఎవరి ద్వారా భగవద్దర్శనమైనా యొక్కటే. పరమాత్ముని ఆప్యాయత ఏ ముఖము ద్వారయైనా యొకే విధమున నుండును.

### 4

೭೯) ಬೆಳಗಿನೊಳಗಣ ಬೆಳಗು ಮಹಾಬೆಳಗು!
ಶಿವ ಶಿವಾ, ಪರಮಾಶ್ರಯವೆ ತಾನಾಗಿ

శతపత్ర కమళ కర్ణికా మధ్యదల్లి
స్వతః సిద్ధ నాగిప్ప నమ్మకూడల సంగమదేవ

79) వెలుగు నందు వెలుగు మహావెలుగు
శివ శివా పరమాశ్రయమె తానౌచు
శతపత్ర కమల కర్ణికామధ్యమందు
స్వతః స్సిద్ధుడై యున్నాడు. మాకూడల సంగమదేవుడు

పరమాత్ముడు అఖండ ప్రకాశ స్వరూపుడు. ఈ సృష్టికి మూలాధారము అతడే. అట్టి పరమాత్ముడు సహస్రారచక్రమను కమల మద్యమందు అద్భుతముగా ప్రకాశించుచున్నాడు.

## 5

౮౦) ఉళ్ళవరు శివాలయ మాడువరు
నానేన మాడువె బడవనయ్యా
ఎన్నకాలే కంభ, దేహవె దేగుల
శిరవె హొన్న కలశవయ్యా,
కూడల సంగమదేవా కేళయ్యా
స్థావరక్కళివుంటు, జంగమక్కళివిల్ల.

80) కలవారు శివాలయము కట్టుదురు
నేనేమి చేతును పేదనయ్యా
నాకాళ్లే స్థంభము, దేహమె దేవాలయం
శిరమే బంగరు కలశమయ్యా
కూడల సంగమదేవ వినవయ్యా
స్థావరము చెడునుగాని జంగమము చెడదయ్యా

ధనముగలవారు యధేచ్ఛగా ఖర్చుచేసి శివాలయమును కట్టింతురు. నేను పేదవాడను ఆ శక్తిలేదని చింతించతగదు. ఎట్లన దీనికన్ననూ ఉత్తము దేవాలయము

కట్టుటకు ఎల్లరకూ సాధ్యము. ఆచార సంకేతమగు కాళ్ళే స్తంభములుగ, హృదయమే గర్భగుడిగ, శిరస్సే బంగరు కలశముగ ఈ శరీరరము జంగమ దేవాలయముగా యగును. అట్టి దేవాలయముగా దేహమును చేసికొనెడి వారలే అధికులు. స్థావర దేవాలయమునకు నాశముగలదు. కాని జంగమ దేవాలయము నకు నాశము లేదు.

## 6

౮౧) మనవంచనెయె అన్యలింగార్చనె!
అదునిజవల్ల నిజవల్ల
కూడల సంగమదేవను మనదంతర్యామి తానాగి

81) మనోవంచనము అన్యలింగార్చన
**అదినిజముకాదు నిజముకాదు**
**కూడల సంగమదేవుడు మనమందు అంతర్యామియైతానేయుండె**

ఒకే లింగపు ముఖమున పరమాత్ముని పూజించి ప్రార్థించి ధ్యానించవలెను. అన్య లింగముల నెల్లాపూజించిన ఫలముయుండదు. పరమాత్ముడు తన యందే అంతర్యామియై యున్నాడని తెలియుడు.

## 7

౮౨) నిన్న నా నరియదమున్న నీనెల్లిద్దె?
ఎన్నాళగిద్దు నిన్న తోఅలికె నీనె రూపాదె
ఇన్ను జంగమవె లింగవెందు నంబిదె,
కూడల సంగమదేవా

82) నిన్నునే తెలియక ముందు నీవెందుంటివి!
నాలోన యుండి నీ వ్యక్తతకు నీవెరూపైతివి
ఇక జంగమమే లింగమని నమ్మితి
కూడల సంగమదేవా

నేను నిన్నుతెలియక ముందు ఎందుంటివయ్యా. నాలోనే నీవు ఆత్మరూపుడవై యున్నాడవు. జంగమరూపమున నీవు దర్శన మిచ్చెదవని నమ్మితినయ్యా.

## 8

౮౩) అరసుమునిదడె నాడొళగిర బారదయ్యా
గండమునిదడె హెండతి ఇరబారదయ్యా
కూడల సంగమదేవా,
జంగమమునిదడె నానెంతు బదుకువె?

83) **రాజు కోపింప ఆ రాజ్యము నందుండ రాదయ్యా**
**భర్త కొపింప భార్య ఇంట యుండదగదయ్యా**
**కూడల సంగమదేవా,**
**జంగముడు అలిగిన నేనెటుల బ్రతికెద**

రాజు కోపమునకు గురియైన వానికి ముప్పువాటిల్లును కావున అతడు రాజ్యపు సరిహద్దులను దాటివెడలిననే క్షేమము. భార్య, భర్త అతి కోపమునకు గురియైన వేళ ఆ యింట యుండ తగదు పరమాత్మా జంగముడు అనగా మహా తపస్వియైన మహాత్ముడు అలిగిన నేను బ్రతుకుటే కష్టము.

## 9

౮౪) జంగమవె లింగవెనగె జంగమవె ప్రాణవెనగె
కూడల సంగమ దేవయ్యా,
ఎనగెయూ నినగెయూ జంగమ ప్రసాదవె ప్రాణ

84) **జంగమమే లింగమునాకు; జంగమమే ప్రాణమునాకు**
**కూడల సంగమదేవయ్యా**
**నాకూ నీకూ జంగమ ప్రసాదమే ప్రాణము**

పరమాత్మని అంశతో కారణ జన్మడుగా మహిమాపురుషుడుగా పిలువబడువాడు జంగముడు. అట్టి జంగముడు నాకు లింగస్వరూపి. అతడే నా ప్రాణ శక్తి. పరమాత్మా నాకూ నీకూ అట్టి జంగమ ప్రసాదమే ప్రాణము.

## 10

౮౫) కంగళు తుంబిదబళిక నోడలిల్ల
కివిగళు తుంబిద బళిక కేళవిల్ల
కైగుళు తుంబిద బళిక పూజిసలిల్ల
మన తుంబిద బళిక నెనెయలిల్ల
మహంత కూడల సంగమదేవన.

85) కన్నులు నిండినచో చూడలేను
చెవులు నిండినచో వినలేను
చేతులు నిండినచో పూజింపలేను
మనసు నిండినచో తలచలేను
పరమాత్ముడగు కూడల సంగమదేవుని

81) షటస్థలములగు ఆధ్యాత్మిక సోపానములతో ప్రాణలింగి స్థల మందలి ఐక్య స్థితియందుండు శరణునకు కన్నులు తెరచినటులుగాయున్ననూ ఏ దృశ్యము చూడలేడు, చెవులు ఏశబ్దమునూ వినలేని స్థితియందుండును. ఆతని చేతులు సాధారణ మానవులవలె పూజసలుపు స్థితి యందుండవు. అతడి మనస్సు ధ్యానమగ్నతతో పరమాత్ముని తలంచు స్థితియందుండక లింగాను సంధాన స్థితి గలిగియుండును.

## 11

౮౬) అడిగడిగె స్థాన నిధి, అడుగడిగె దివ్యక్షేత్ర
అడిగడిగె నిధియు, నిధాన నోడా!
ఆతన ఇరవె వారణాసి, అవిముక్తి క్షేత్ర
కూడల సంగన శరణ స్వతంత్ర నాగి

86) అడుగడుగునా స్థాననిధి, అడుగడుగునా దివ్యక్షేత్రము
82 అడుగడుగునా నిధి నిధానము గనుమా!
అతడి నెలవే వారణాసి, అవి ముక్త క్షేత్రము
కూడల సంగని శరణుడు స్వతంత్రుడైయుండు.

పరమాత్మా నీ శరణులు తాకిన నేల పావనము. అతని పాదము తాకిన నెలవులు స్థాన నిధులగు పవిత్ర భూములు, దివ్య క్షేత్రము. అతడు నివసించు పురము వారణాసి, అవిముక్తక్షేత్రము. పరమాత్ముని దూతయగు శరణుడు సర్వస్వతంత్రుడు.

# ౧౧ శరణస్థలము

## 1

౮౭) ఉంబ బట్టలు బేరె కంచల్ల నోడువదర్పణ బేరె కంచల్ల
భాండ ఒందె, భాజన ఒందె, బెళగె కన్నడి యెనిసిత్తయ్యా
అరిదడె శరణ మరెదడె మానవ
మరెయదె పూజిసు నమ్మకూడల సంగమదేవన

87) తినెడి పాత్ర వేరె కంచము కాదు చూచెడి అద్దము వేరె కంచముకాదు.
భాండము ఒకటె, భాజనము ఒకటే, రుద్దగ అద్దవమనిపించు
ఆరయువాడె శరణుడు, మరువగ మానవుడు
మరువక పూజించు, మా కూడల సంగమదేవుని

పూర్వ కాలమందున రుద్దిన కంచు పాత్రలే అద్ధముగా వాడెడివారు. తినే పాత్రగా కూడా కంచు పాత్రలే వాడెడివారు. రెండు పాత్రలూ ఒకే లోహముతో చేసినవైనా వేర్వేరు ఉపయోగములకు పనికివచ్చులాగున తననుతాను తెలిసికొనినవాడే శరణుడు, మరపు గలవాడే మానవుడు. శరణడగుటకై పరమాత్ముని మరువకుండా పూజింపుము.

## 2

౮౮) మణ్ణ మడకె మణ్ణాగదు క్రియెళిదు
బెణ్ణె కరగి తుప్పవాగి మగళి బెణ్ణయాగదు క్రీయళిదు.
హొన్ను కబ్బున వాగదు క్రీయళిదు
ముత్తు నీరల్లి హుట్టి మత్తె నీరాగదు క్రీయళిదు
కూడల సంగన శరణనాగి
మరళి మానవ నాగను క్రీయళిదు.

88) కుండ పగిలి మన్ను కానేరదు క్రియచెడి
వెన్న కరిగి నెయ్యి అయిన తదుపరి మరల వెన్నకానేరదు క్రియచెడి
బంగారము ఇనుము కానేరదు క్రియచెడి
ముత్యము నీటి బిందువు నుండి పుట్టిన అది తిరిగి నీరు కాదు క్రియచెడి
కూడల సంగని శరణుడుగా మారినవాడు
తిరిగి మానవుడు కానేరడు క్రియచెడి.

మట్టితో తయారైనట్టి కుండ పగిలి మరల మన్నుకానేరదు. నెయ్యి కరిగి దానిపూర్వపు స్థితి అగు వెన్న కానేరదు. పరుశవేది నుండి ఇనుము బంగా రముగా మారిన తదుపరి అతి తిరిగి ఇనుము కానేరాదు. నీటి బిందువు నుండి ఉద్భవమొందిన ముత్యము మరలా నీరు కానేరదు. ఇదే విధమున శరణుడైన (సత్పురుషుడైన) మనుజుడు మరల మనిషి కాలేడు.

## 3

౮౯) లగ్న వెల్లియదో, విఘ్నవెల్లియదొ, సంగయ్యా?
దోష వెల్లియదో, దురిత వెల్లియదో, సంగయ్యా?
నిమ్మనెనెవంగె భవకర్మ వెల్లియదొ
కూడల సంగయ్యా?

89) లగ్నమెక్కడిదొ, విఘ్నమెక్కడిదో సంగయ్యా?
దోష మెక్కడిదో, దురితమెక్కడిదో సంగయ్యా?
నిన్నుతలచువారలకు భవ కర్మ మెక్కడిదో
కూడల సంగయ్యా?

కష్టపడి లగ్నమువెదకుట, అకస్మాత్తుగా అది తప్పిపోయినచో విఘ్నమైన దనుట, దొష ప్రాప్తి అనుట, ఏ జన్మదో కర్మ బంధనము అనుట ఇవన్నియూ భయగ్రస్త మనుజుని దుర్భల మనస్సు యొక్క భ్రాంతి పరమాత్ముని దృఢముగా నమ్మినవానికి ఎలాంటి జంజాటము లేదు.

## 4

೯೦) ಶರಣ ನಿದ್ರೆಗೈದಡೆ ಜಪಕಾಣಿರೋ
ಶರಣ ನೆದ್ದು ಕುಳಿತಡೆ ಶಿವರಾತ್ರಿ ಕಾಣಿರೋ
ಶರಣ ನಡೆದುದೆ ಪಾವನ ಕಾಣಿರೋ
ಶರಣ ನುಡಿದುದೆ ಶಿವತತ್ವ ಕಾಣಿರೋ
ಕೂಡಲ ಸಂಗನ ಶರಣನ
ಕಾಯವೆ ಕೈಲಾಸ ಕಾಣಿರೋ.

90) శరణుడు నిద్రింపగ జపమని తెలియుము
శరణుడు మేల్కాంచిన శివరాత్రని తెలియుము
శరణుడు నడచిన నేల పవిత్రమని తెలియుము
శరణుడు నుడివినది శివతత్వమని తెలియుము
కూడల సంగని శరణుని
కాయమే కైలాసమని తెలియుము

శరణ స్థలమందలి శరణస్థలములో గల శరణుడు నిద్రింపగ జపమేయగును అతడు మేల్కాంచిన శివరాత్రియని అననగును. అతడు నడచిన నేల పవిత్రమగును. అతడు పలుకున దంతయూ శివతత్వమే. పరమాత్ముడు పంపగా వచ్చిన శరణుని దేహమే కైలాసమని తెలిసికొనుము.

## 5

೯೧) ನೆಲನೊಂದೆ ಹೊಲಗೇರಿ - ಶಿವಾಲಯಕ್ಕೆ
ಜಲವೊಂದೆ ಶೌಚಾಚಮನಕ್ಕೆ
ಕುಲ ವೊಂದೆ ತನ್ನ ತಾನರಿದವಂಗೆ
ಫಲ ವೊಂದೆ ಷಡುದರುಷನ ಮುಕ್ತಿಗೆ
ನಿಲವೊಂದೆ, ಕೂಡಲ ಸಂಗಮ ದೇವಾ, ನಿಮ್ಮ ನರಿದವಂಗೆ

91) స్థలమొకటె దళితవాడకు - శివాలయమునకు
జలమొకటె శౌచాచమన మునకు

కులమొకటె తన్ను తానెరిగిన వానికి
ఫలమొకటె షడ్డర్శన ముక్తికి
నిలువొకటె కూడల సంగమదేవా నిన్నెరిగిన వానికి

దళితవాడనైనా కాని, శివాలయమును గాని కట్టునది ఒకే నేలపై, పూజాదికములకు గాని, శౌచాచమనమునకుగాని వాడునది ఒకే జలమును. ఆత్మ జ్ఞానము గలవారలంతా ఒకే కులజులు. షడ్దర్శనములను ఎవరే అలవరచు కొనని వారి ఫలము ఒకే విధముగా యుండును. పరమాత్ముని తెలిసిన వారల స్థితి ఒకే విధముగాయుండును.

## 6

೯೨) హ లెంజలు పేయన, ఉదక వెంజలు మత్స్యద, పుష్పవెంజలు తుంబియ
ఎంతుపూజిసువెనయ్యా శివ శివా! ఎంతు పూజిసువె?
ఈ ఎంజల వనతిగళెవడె ఎన్నళవల్ల
బందుదనైకొ కూడల సంగమదేవా

92) పాలు దూడ ఎంగిలి, నీరు చేప ఎంగిలి, పూలు తుమ్మెద ఎంగిలి
ఎటులు పూజింతునయ్యా శివ శివా ఎటుల పూజింతు
ఈ ఎంగిలినతిక్రమింపగ నా తరముగాదు - ఇచ్చినది
గైకొనుము కూడల సంగమదేవా

పరశివా పరమాత్మా నిన్నెటుల పూజింతు? నీటితో అభిషేకింతునన ఆ నీటిని చేప ఎంగిలి చేసె. పాలతో అభిషేకము చేతమనిన ఆ పాలను దూడ ఎంగిలి చేసె. పూలర్పించుదమనిన వాటిని తుమ్మెద ఎంగిలి చేసె. ఇదిలేకుండగ పూజ చేయుట నా వల్ల గాదు. కావున పరమాత్మా నేనేమిచ్చినా గైకొనుము.

## 7

೯೩) "బసవ బారై, మర్త్యలోకదొళగె భక్తరుంటె? హేళయ్యా"
మత్తారు ఇల్లయ్యా, మత్తారు ఇల్లయ్యా మత్తారు ఇల్లయ్యా

నా నొబ్బనే భక్తను, మర్త్యలోకదొళగణ భక్తరెల్లరు
జంగమ లింగ, నీనె అయ్యా; కూడల సంగమదేవా

93) "బసవ రావయ్యా, మర్త్యలోకమున భక్తులున్నచో తెలుపుమయ్యా"
మరెవ్వరూ లేరు, మరెవ్వరూ లేరు, మరెవ్వరూ లేరయ్యా
నే నొకడనే భక్తుడను, మర్త్యలోకమునందున్న భక్తులందరు
జంగమ లింగము, నీవే అయ్యా, కూడల సంగమదేవా

బసవేశ్వరుని "ఈ మర్త్యలోకమున" ఎవరైన భక్తులుండిన తెలుపుమని యడుగ ఎవరూ లేరు, మరెవరూ లేరు నేనొకడనే భక్తుడను మిగిలిన లోకమున గల జనులంతా లింగస్వరూపము, జంగమ స్వరూపము అని తెలిపిరి. శరణులగు పవిత్ర మానవులుగా మారిన వారలు తాముతప్ప మిగిలినదంతా దేవుని స్వరూపమనే భావము పెంచుకొనెదరు.

## 8

೯೪) తను మన ధన వెంబ కన్నడినోడయ్యా
ఎన్నదుఅల్ల, నిన్నదు అల్ల, బరియ భ్రమెయమాతు
ఆభ్రమె గొళగాగి నిమ్మ శ్రీ చరణవ బిడె
కూడల సంగమదేవా

94) తను మన ధనము లనెడి అద్దము చూడయ్యా
నాదీకాదు, నీదీ కాదు, వట్టి భ్రమ యొక్కమాట
ఆభ్రమకులోనై నీ శ్రీ చరణము వీడను
కూడల సంగమదేవా

తనువు, మనము, ధనములు అనునవి అద్దములో కనబడెడు రూపు వంటివి. వట్టి భ్రమలనెడి రూపులు గాంచి సన్మార్గము వీడనేరదు. పరమాత్మా భ్రమకులోనుకాను. నీ శ్రీ చరణమున శరణు జొచ్చెదను.

## 9

౯౫) గ్రహబందు ఆవరిస లొడనె తన్న మరిసువదు
మత్తొందక్కెంబు గోడలీ యదయ్యా,
కూడల సంగమ దేవన అరివు అనుపమ వాగలొడనె
బెవహార దొళగిర లీయదయ్యా

95) గ్రహము వచ్చి ఆవేశింపగనె, తన్నుదామరపించు
వేరొకదానిని దరి జేరనీయదయ్యా
కూడల సంగమదేవుని జ్ఞానము అనుపమమైనంతనె
వ్యవహారమున నిలువనీయదయ్యా

మనుజుని గ్రహము ఆవరించిన తనను తామరచును. వేరే దానిని దరిజేరనీయదు. పరమాత్ముని దివ్యజ్ఞానము బడసి నంతనే నిత్యవ్యవహారములందు నిలువనీయదు.

## 10

౯౬) పూజెయుళ్లన్నబర లింగవహాడిదె
మాట వుళ్ళన్న బర జంగమవ హాడిదె
జిహ్వెయుళ్ళన్న బర ప్రసాదవ హాడిదె
ఈత్రివిధ నాస్తియాద బళిక
ఎన్న నాహాడు కొండె, కాణా, కూడల సంగమదేవా

96) పూజ చేయునంతవరకు, లింగమును పాడితి
మాట యున్నంతవరకు జంగముని గొలిచితి
నాలుక యున్నంతవరకు ప్రసాదమును గ్రోలితి
ఈ త్రివిధము నాస్తియై పోవ నన్నునే పొగడుకొంటిని గనుమా
కూడల సంగమ దేవా

శరీరమునకు పూజ సలిపెడి శక్తియున్నంతవరకు లింగము నర్చించితిని. నోటికి మాటాడు శక్తియున్నంతవరకు జంగముని గొలిచి తృప్తి పరచితిని. నాలుకకు శక్తి యుండువరకు ప్రసాదమను రుచిని గ్రోలితిని. ఈ మూడూ సహకరించని సమయాన అంతరంగమున నన్నునే పాడుకొంటినయ్యా నిన్ను తలచుచూ పరమాత్మా.

**11**

೯೭) తెరపిల్లదనడె, తెరపిల్లదనుడి, తెరపిల్లద సంభాషణెయ సుఖవు
తెరపిల్లద నంబిదె, స్వాను భావద సుఖవు
తెరపిల్లద మహిమె, తెరపిల్లద విచార
కూడల సంగమ దేవా, నిమ్మ శరణంగె!

97) ఎడతెగని నడత, ఎడతెగని నుడి, ఎడతెగని సంభాషణా సుఖము
ఎడతెగని నమ్మకము, ఎడతెగని స్వానుభావపు సుఖము
ఎడతెగని మహిమ, ఎడతెగని విచారము
కూడల సంగమదేవా నీ శరణులకు

పరమాత్మా నీ శరణులకు ఎడతెగని నడత, ఎడతెగని మడి, ఎడతెగని సంభాషణా సుఖము, ఎడతెగని నమ్మకము, ఎడతెగని స్వానుభావపు సుఖము, ఎడతెగని మహిమ, ఎడతెగని విచారము. శరీరముతోనున్ననూ శరణులు సాధారణ మానవులు కారు.

# ఐక్య స్థలము

**1**

೯೮) బయలరూప మాడబల్లాతనె శరణను
ఆరూప బయల మాడ బల్లాతనె లింగాను భావి,
బయల రూప మాడలరియ దిద్దడె ఎంతు శరణనెంబె?
ఆ రూప బయల మాడలరియదిద్దడె ఎంతులింగాను భావియెంబె?
ఈ ఉభయ బందాదడె నిమ్మల్లి తెరహుంటె
కూడల సంగమదేవా

98) బయలు రూపము చేయగలవాడె శరణుడు
ఆ రూపమున బయలు చేయగలవాడె లింగాను భావి?
బయలును రూపింప తెలియని వానిని శరణుడనుటెటుల

ఆ రూపమును బయలు చేయ తెలియని వానిని లింగాను భావియనుటెటుల
ఈ రెండు ఒక్కటైనచో నీయందు భేదమిక లేదు.
కూడల సంగమదేవా.

నిరాకారమైన బయలును సాకారముగా చేయగలవాడు శరణుడు. ఆసాకారమును అర్చించుచు నిరాకారమునకు పోవు సాధన నేర్చిన వాడు లింగాను భావి. నిరాకారమును సాకారాము చేయ తెలియని వాడు శరణుడు కానేరడు. అదేరీతిగా సాకారము నుండి నిరాకరమునకు పోవుట తెలియని వాడు లింగానుభావి కానేరడు. రెండూ తెలిసిన వాడే నిజశరణుడు, నిజలింగానుభావి.

## 2

౯౯) ఏనాదడూ సాధిసబహుదు
మత్తేన నాదెడెయూ సాధిసబహుదయ్యా
తానారెంబుద సాధిసబారదు
కూడల సంగమ దేవర కరుణ వుళ్ళ వంగల్లదె

99) ఎదైనా సాధింప వచ్చు
మరేదైననూ సాధింపవచ్చునయ్యా
తానెవ రనునది సాధించలేము
కూడల సంగమదేవుని కరుణ కలుగు నందాక 99

ఏదైనను సాధింపవచ్చును. ఎటువంటిదానినైననూ సాధింపవచ్చును. కాని పరమాత్ముని కృప పూర్తిగా హెచ్చు పాళ్లలో కలుగు వరకు తానెవరనునది తెలిసికొనుటను సాధించలేము.

## 3

౧౦౦) హుత్తక్కె ఏసు బాయాదడేను? సర్పనిప్పుదు ఓందేస్థాన!
భావ భావిసి భ్రమెయళిదు నోడా
అభావ భావిసలు నిర్భావ కూడల సంగమదేవా

100) ఎన్ని నోరులున్న నేమి పుట్టకు? సర్పము ఒక్కచోట నేయుండు
భావము భావించి భ్రమను తొలగించి చూడుమా
ఆభావము భావింపగ నిర్భావము కూడల సంగమదేవా

పుట్టకు అనేక రంధ్రము లుండును. కాని పాము వాటిలో ఏదోయొక దాని యందు మాత్రమే యుండును. ఎట్టి భ్రమకు లోనుకాక భావమున భావించి నిర్భావమున పరమాత్మను తెలియుము.

**4**

౧౦౧) సమస్త కత్తలెయ మసకవ కళెదిప్ప ఇరవనోడా!
బెళగిగె బెళగు సింహాసనవాగి
బెళగు బెళగ కూడిద కూటవ
కూడల సంగయ్య తానెబల్ల!

101 సమస్త అంధకార మసకను దాటియున్న దానిని గనుమా
వెలుగునకు వెలుగు సింహాసనమై
వెలుగు వెలుగ కూడిన కూటమి
కూడల సంగయ్య తానె యెరుగును

గాఢాంధకారపు మసకను దాటి వెలుగు నందలి వెలుగై సింహాసనమునందు ఓ వెలుగు అద్భుత ప్రకాశముతో వెలుగుచుండును. పరమాత్ముడిలా ఆ వెలుగు కూటమిన కూడి యుండును.

**5**

౧౦౨) అంతరంగ బహిరంగ ఆత్మ సంగ ఒందె అయ్యా!
నాదబిందు కళాతీత, ఆది యాధార నీనె అయ్యా!
ఆరూఢద కూటవ సుఖవ కూడల సంగయ్య తానెబల్ల!

102) అంతరంగము బహిరంగము ఆత్మసంగము ఒకటేనయ్యా
నాద బిందు కళాతీతుడవు, ఆదియాధారము నీవేనయ్యా
ఆరూఢపు కూటస్థ సుఖము కూడల సంగయ్యాయే ఎరుగును

అంతరంగము అనునది బహిరంగము అనునది ఆత్మసంగమ మనునది ఒకటే. నాద బిందు కళాతీతుడు, ఆది యాధారుడు పరమాత్ముడే. ఆరూఢ కూటపు సుఖము పరమాత్మునికే తెలియును.

# 1 సృష్టికర్త పరమాత్ముడు (SUPREME GOD)

## 1

౧౦౩) ప్రణవారూఢను, ప్రణవ స్వరూపను, ప్రణవ ప్రకృతి సౌంజ్ఞను
ప్రణవ షడంగ సమరస
నమ్మకూడల సంగమ దేవరు

103 **ప్రణవాధి రూఢుడు, ప్రణవ స్వరూపుడు, ప్రణవ ప్రకృతి సౌంజ్ఞడు**
ప్రణవ షడంగ సమరసుడు
**మా కూడల సంగమదేవుడు**

సృష్టికన్నా పూర్వము పరమాత్ముడు ఆరూఢుడైయుండి స్వయంభువు అనిపించుకొనెను. తదుపరి ప్రణవ స్వరూపుడై సృష్టికర్త అనిపించు కొనెను. ప్రకృతి సౌంజ్ఞ గలవాడై, సూత్రధారియై ఈ సృష్టిని ఆడించుచున్నాడు. విశ్వము నందెల్లా వ్యాపించి సమరసుడై యున్నాడు.

## 2

౧౦౪) అమూల్యను అప్రమాణను అగోచరలింగవు,
ఆదిమధ్యాంతవిల్లద లింగవు, స్వతంత్రలింగవు,
నిత్యనిర్మల లింగవు,
అయోని సంభవనయ్యా నమ్మకూడల సంగమదేవరు

104) అమూల్యుడు, అప్రమాణుడు, అగోచరలింగము
ఆది మధ్యాంతములు లేని లింగము స్వతంత్ర లింగము
నిత్య నిర్మల లింగము
అయోని సంభువుడయ్యా మా కూడల సంగమదేవుడు

పరమాత్ముడు అమూల్యుడు - వెలకట్టలేనివాడు, అప్రమాణుడు - ప్రమాణాతీతుడు, పంచేంద్రియములకు అగోచరమైనవాడు. పుట్టుక, చావులు లేనివాడు, స్వతంత్రుడు, నిత్యుడు, నిర్మలమైన వాడు, తల్లిదండ్రుల కడుపులో పుట్టనివాడు అనగా స్వయంసిద్ధుడై యున్నవాడు.

# 2. పరమాత్ముని ఆరాధింపుము

## 1

౧౦౫) సంసార వెంబుదొందు గాళియ సొడరు
సిరియెంబు దొందు సంతెయ మంది కండయ్యా!
ఇదనచ్చి కెడబేడ - సిరియెంబుద
మరియదె పూజిసు నమ్మకూడల సంగమదేవన.

105) సంసారమనునది యొకగాలి దీపము
సంపద యనునది సంతయందలి గుంపుకనుమయ్యా
దానిని మెచ్చి చెడకుము, ఆ సిరిని నమ్మి చెడకుము
మరువక పూజింపుము మా కూడల సంగమదేవుని

నేను, నాది, నానుండి, నాకు అను ఈ సంసారము గాలిలో పెట్టిన దీపము వలె క్షణికమైనది. శ్రీమంతత్వము అనునది సంతలో చేరిన గుంపువలె నశ్వరము. దానిని నమ్మి చెడకుము. శాశ్వతుడైన పరమాత్ముని ఆశ్రయించి ఆరాధింపుము.

## 2

౧౦౬) హాడిదడెన్నొ డెయన హాడువె
బేడిద డెన్నొడెయన బేడువె
ఒడెయం గొడల తోటి ఎన్న బడతనవ బిన్నైసువె
ఒడెయ మహాదాని కూడల సంగమదేవంగె
సెరగొడ్డి బేడువె

106) పాడినచో నా యజమానిపై పాడెద
వేడినచో నా యజమాని నే వేడెద
కష్టసుఖముల పేదరికము నతనికే తెలిపెద
నాయజమాని మహాదాత కూడల సంగమదేవుని
కొంగు చాచివేడెద

నేను పాడినచో నా యజమాని యగు పరమాత్ముని గురించియే పాడెదను. వేడినచో అతడినే వేడెదను. నా కష్టసుఖములు, కొరతలను, పేదరికమును అతడికే నివేదించుకొనెదను. జగత్తున కంతయూ మహాదాతయగు పరమాత్ముని కొంగుచాచి వేడెదను.

## 3

౧౦౭) ఎలె ఎలె మానవా, అళియాసె బేడవో,
కాళ బెళుదింగళు సిరి స్థిరవల్ల!
కేడిల్లద పదవి
కూడల సంగమదేవన మఱియదె పూజిసు

107) అరరే మానవా అతి ఆశ పడబోకురా
అడవిగాచిన వెన్నెల, సిరి స్థిరముకాదు
కీడులేని పదవి నిచ్చెడి
కూడల సంగమదేవుని మరువక పూజించు

మానవులకు అత్యాశకీడొనర్చును. అడవిగాచిన వెన్నెల మరియు శ్రీమంతము బహుళ క్షణికము. శాశ్వత పదవి నిచ్చు పరమాత్ముని మరువక పూజింపుము.

# ఆద్యుల వచనములు

## 1

౧౦౮) హాల తొరెగె బెల్లదకెసరు సక్కరెయ మళలు
తవరాజదంతహ నొరెతెరెగళు. ఇంతప్ప
ఆద్యర వచన విరలు బేరెబావియతోడి
ఉప్పనీర సవిదం తాయిత్తయ్యా ఎన్నయుక్తి
నిమ్మ వచనంగళ కేళదె, అన్యపురాణంగళ కేళి
కెట్టెనయ్యా కూడల సంగమదేవా

108) **పాలధారకు బెల్లపు పిసరు చక్కెర తీపి**
**అమృతము లక్షణమువలె ఆద్యుల వచనములుండగ**
**వేరె బావిన ఉప్పునీటిని తోడి పొందుటెందులకు**
**వచనములను తెలియనిదె అన్యపురాణములను విని**
**చెడితినయ్యా కూడల సంగమదేవా**

పాలధార ప్రవహించుచున్నది. దానికి బెల్లము వంటి పిసరు, చక్కెర వంటి తీపి, అమృతపు లక్షణము. ఈ రీతిగా ఆద్యుల (బసవేశ్వరుడాదిగా అతడి సమకాలీన శివశరణులగు అల్లమ ప్రభువు, అక్కమహాదేవి, చిన్మయ జ్ఞాని చెన్న బసవేశ్వరుడు, శివయోగి సిద్ధరామేశ్వరుడు, మడివాళమాచిదేవుడు మున్నగువారు) వచనము లుండగా - వేరె బావినుండి ఉప్పునీటిని తోడి పొందుటెందులకు? శరణుల వచనములను వినకుండా ఇతర పురాణములను వినుట మూర్ఖతనమంతే.

# గద్య

ఇది శ్రీ మద్బసవేశ్వర కలితా వరప్రసాదలబ్ద రచనా ధురీణ ప్రసిద్ధ వీర సాంప్రదాయస్య శ్రీ కొల్లంపల్లి కొండ వీరణ్ణ ప్రపౌత్ర కొండా వీరప్ప ప్రథమ పుత్ర శ్రీ కొండా బసవరాజు ప్రణీతంబగు యథాతథం "బసవ వచనామృతం" (వ్యాఖ్యాన సహితము) అష్టోత్తర శత బసవవచన అమృతము సంపూర్ణము.

